# NIRANKUSOPAKHYANAMU

BY

RUDRA KAVI



V. RAMASWAMY SASTRULU & SONS
192, Esplanade Row
MADRAS.
1916.

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతము— | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ,, ... | 1 | 12 |
| ఆరణ్యపర్వముగలసంపుటము ,, ... | 1 | 12 |
| విరాటోద్యోగపర్వములుగలసంపుటము ,, ... | 1 | 12 |
| శాంతిపర్వము ,, ,, ... | 1 | 12 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ,, ... | 5 | 0 |
| లంకావిజయము, సటీక ... | 1 | 8 |
| కృష్ణరాయవిజయము,కుమార. ధూర్జటి ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు ... | 2 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | 1 | 8 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు ... | 2 | 8 |
| గోపీనాథరామాయణము,శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యకావ్యము | 4 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కఁగముద్రితము | 0 | 8 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము ... | 2 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 1 | 8 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది ... | 0 | 10 |
| కాశీఖండము ,, ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 3 | 0 |
| డిటో మేలుప్రతి, చక్కనిబైండు ... | 4 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి ... | 5 | 8 |
| మనుచరిత్ర, సటీక ... | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద, సటీక, చక్కనిప్రతి ... | 3 | 0 |
| కళాపూర్ణోదయము,దళసరికాగితములు ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 8 |
| విజయవిలాసము,చేమకూర. వేంకటకవి ... | 0 | 4 |
| సారంగధరచరిత్ర, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవికృతము ... | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవికృతము ... | 0 | 4 |

శ్రీ రస్తు.

# నిరంకుశోపాఖ్యానము

కందుకూరు. రుద్రయకవి ప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1916.

# పీఠిక.

ఈనిరంకుశోపాఖ్యానము రచించినమహాకవి రుద్రయ్య, స్వర్ణకారుఁడు (కమసాలి), ఇంటిపేరు కందుకూరివారు, ఇతనితండ్రి పెదలింగన్న, తల్లి పేరు దెలియుట కేయాధారము లేకున్నను జతుర్థాశ్వాసాంత పద్యమునందు 'సాధ్వీశతవినుత చెన్నమాంబానుత' అని సోమేశ్వరునకు విశేషణము వాడినందున నీచెన్నమ్మ తల్లి యనియు, నీమె సోమేశ్వరువరప్రసాదంబున రుద్రయను బుత్త్రుఁగాఁ బడసియుండవచ్చుననియుఁ దోఁచుచున్నది. ఈతనినివాసస్థలము నెల్లూరిమండలమునందలి కందుకూరను గ్రామము. ఈతనివంశమువార లిప్పటికి నాయూరనున్నట్లు తెలియుచున్నది. ఇతఁడు గుంటుపల్లి. భాస్కరుని కాలమువాఁడగుటచేఁ గ్రీ॥ శ॥ ప్రాంతమువాఁ డని కవులచరిత్ర నుడువుచున్నది. ఇక్కవి నిరంకుశోపాఖ్యానమే కాక సుగ్రీవవిజయ మనుమఱియొక ప్రబంధమునుగూడ రచించెను. ఆగ్రంథమును గుఱించి యీకావ్యమునందుఁ బ్రశంససేయకుండుటవలన నీకబ్బమురచించినపిదప దానిని రచించిన ట్లూహింప వలసియున్నది.

ఇతం డాశ్వాసాంతగద్యమునందు 'పెదలింగనార్యగర్భార్ణవపూర్ణిమాత్రేయ' యని వక్కాణించియున్నాఁడు. తొల్లిటికవు లెల్లరు మాతృగర్భము నర్ణవమునకుం బోల్చి తాము చంద్రులమని చెప్పియుండిరే కాని యీలాగునఁ జెప్పలేదు. ఇట్లునుడువుటకు నేదేని పూర్ణాభిప్రాయము కవి మనమున నుంచుకొనియుండు ననవలసియున్నది. ఊహింప విద్వజ్జనులు ప్రార్థితులు. ఈగ్రంథమును గందుకూరిసోమేశ్వరనాథునికిం గృతి యిచ్చెను. యీకవి స్వర్ణకారుండయ్యును నిప్పటిదురభిమానదుర్విదగ్ధులవలెఁ గాక యత్యంతము దేవబ్రాహ్మణభక్తియు, ఆస్తిక్యముఁ గలిగినవాఁ డనుటను నీతనిగ్రంథమునం దచ్చటచ్చట సమయోచితముగ వర్ణింపఁబడినపద్యంబులే చాటుచున్నవి. ఈతనికవిత్వము మిక్కిలి రసవత్తరమును, మృదుమధురపదభూయిష్ఠంబును, కౌశికీవృత్తిప్రవిష్టంబును, ద్రాక్షాపాకోపశోభితంబును నై పఠితృశ్రోతృజనంబుల హృదయంబుల మహానందాంబుధి నోలలాడించుచున్నది. ప్రౌఢపదప్రయోగమును, సమాస సంవిధానచాతుర్యమును బట్టిచూడ నీతనివ్యాకరణశాస్త్రపాండిత్య మపారమని తోఁచుచున్నది. వర్ణనాసందర్భముల

యందు సమయానుగుణముగఁ జక్కఁనిలోకోక్తుల నిముడ్చి రసభావాదులఁ బోనాడక స్వభావోక్తిని వర్ణించుకవులలో నితని నెవ్వరుఁ బోలరనఁదగును. ఈగ్రంథమున విటజనులవేషభాషలును వారిపై వేశ్యకాంతలు ప్రయోగించుమాయోపాయంబులును నెంత ముచ్చటగ నెంత రమ్యముగ వర్ణింపఁబడి యున్నవో చూడుఁడు. ఈగ్రంథము నెట్టివేశ్యాలంపటుఁడైనను జక్కఁగఁ జదివి యర్థము గ్రహించినచోఁ దోడన వారియం దాతనికి రోఁత జనించుట యబ్రము గాదు. ఈతనికవిత్వము గుణించి సక్రమముగ నెంతేని వ్రాయవలసియున్నను దీఱికలేమిఁగాలాంతరమున నగుఁగాక యని మండూకప్లుతి యొనర్చినందుల కెంతయుఁ జింతగ నేయున్నది. ఈగ్రంథమునందలికథ తెనాలి. రామకృష్ణునిపాండురంగమాహాత్మ్యములోని నిగమశర్మకథ ఛాయననుసరించియున్నది. ఆదికావ్యమగు శ్రీరామాయణము పితృభక్తి,యాశ్రితసంరక్షణము మున్నగునీతులనువలె, మృదుమధురముగాఁ బ్రియురాలు మందహాసముచేఁ గ్రేగంటి చూపులచేఁ గచకుచవిక్షేపణములు మున్నగు విలాసములచేఁ బ్రియుని మనము నొవ్వనిరీతిఁ దనయిష్టమును దెలియంజేయునట్లే కావ్యము 'లోకములో నెంతధనికుఁడైనను వేశ్యాలోలుఁడేని నిక్కదరిద్రుఁడై మహావమానమునం బడి చెడు ననియు, మౌర్ఖ్యముచేత నేనియు భగవద్భక్తి గల్గినచో దరిద్రుఁడైనను భగవత్కటాక్షంబున నత్యంతైశ్వర్య సంపన్నుఁడగుననియు'—నిట్టినీతుల మనోహరముగ బోధించుచున్నది.

కావున రసికాగ్రణులు నీతిబోధకములును, రసవత్తరములును, సలక్షణములు నగునిట్టిమహాకావ్యంబుల గ్రహించి చక్కఁగఁ జదివి, కాకితములు మున్నగునవి చతుర్గుణితక్రయధనమునకు సైతము దొరకని ప్రకృతఘోరయుద్ధసమయంబునఁ గూడ సంస్కృతాంధ్రభాషాపోషణబద్ధదీక్షు లగుటంజేసి వ్యయప్రయాసముల నోర్చి ప్రాచీనంబు లగు సద్గ్రంథంబులఁ బ్రకటించుచున్న బ్రహ్మశ్రీ, వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్‌గారికి మిగులనుత్సాహంబుఁ గలుగంజేయుచు, గ్రంథవిషయవిమర్శనంబునఁ బురాతననాధునాతనగ్రంథరస వైలక్షణ్యముం గనుఁగొని, యుభయభాషాపాండిత్యముం బడసి యానందింతురుగాత యని యెంతయు ధీమంతులఁ బ్రార్థించుచున్నాఁడ.

శ్రీమదుత్పల. కౌశిక. వేంకటనరసింహాచార్యులు.



శ్రీ రస్తు.

# నిరంకుశోపాఖ్యానము

## పీఠిక.



భాషారమణీవిమృష్టపదరాజీవోత్తమాంగార్చ్యుఁ డా
ర్యాభామాపరిణేత సర్వజగదారాధ్యుండు మూర్తిత్రయీ
శోభాకందము కందుకూరినగరీసోమేశ్వరస్వామి లో
కాభీష్టంబు లొసంగుఁగాతఁ గరుణాయత్తైకచిత్తంబునన్. 1

సీ. పక్కిరాతేజిపై నెక్కినయభ్యాసి, చాణూరుఁ ద్రుంచినసత్యరాశి
సిరిమనోధనము ముచ్చిలిన కన్నపుదొంగ, గొల్లచేడెలతోఁడుకోడెకాఁడు
భువనమంతయుఁగన్న పుత్త్రుఁగాంచినతండ్రి, స్వర్ణాంబరముఁగట్టు వన్నెబెట్టు
పౌరస్త్యభోగిపైఁ బవళించుసుఖవాసి, పరమపదం బేలుపాదుసాహి
గీ. మానవుల కెల్ల నిజపదస్మరణమాత్ర, నైహికాముష్మికము లిచ్చునట్టిదాత
కందపురజనార్దనుఁడు భీకరవిరోధి, మర్దనుఁడు భక్తలోకంబు మనుచుఁగాత. 2

క. శతకోటికల్పవాటీ, శతకోటిద్యుతుల నవ్వుసతి గల్గినయా
చతురాస్యు నఖిలవిద్యా, చతురాస్యుఁ దలంతుఁ గావ్యసర్గంబునకున్. 3

సీ. చంద్రరేఖాసమాసంగరంగస్మాళి, శోభితహారపక్షోజపాళి
శమదమాన్వితమనస్సమధూళిసుమధూళి, లసమాననానాకళాప్రతోళి
ప్రతిపక్షరాక్షసప్రాణానిలవ్యాళి, దీప్రానుకంపారసప్రణాళి
రాజీవగేహాసరస్వతీముఖ్యాళి, నతజనవ్రాతమానసమరాళి
గీ. రాజశేఖరచేతఃపయోజహేళి, సకలనిగమార్థకుసుమభాస్వన్మధూళిఁ
జిరకృపాలోకపోషితసేవకాళిఁ, గాళిఁ బ్రణుతింతు సుపదరింఛోళికొఱకు. 4

ఉ. ఏలికసానియై యనిమిషేందునిభాస్యల కాదరంబుతో
వాలికచూపులం బనులవైపులు దెల్పు సమస్తదేవతా
మౌలికఁ జంద్రజూటమలపాలికరాజదురోజపాలికం
గాళికఁ బాదసేవకశిఖావళకాళికఁ బ్రస్తుతించెదన్. 5

సీ. కొమ్ముపై సవతిఁ గైకొని నిల్చెనని నాథు, బొమ్ముపై నిల్చె నారూఢిమహిమ
నఖిలలోకాధీశుఁ డగునాయకుని దెచ్చి, యిల్లటం బిచ్చి పుట్టింట నిలిపెఁ
దనపేరు మున్నుఁగా ననిమిషాదులచేతఁ, బ్రణుతింపఁగాఁ జేసెఁ బ్రాణవిభుని
వినమజ్జనులఁ బ్రోవ నొనరించెఁ బతివాలుఁ, గన్నుఁ దామరలందుఁ గాఁపురంబు
గీ. చక్కదనమున నీరేడుజగములందు, సవతుఁ గాంచనిసుతుఁ గాంచె ధవునికరుణఁ
దలఁపఁ జెల్లదె గుణధన్యఁ గలుషశూన్య, సాధుమాన్యఁ గృపానన్య జలధికన్య. 6

శా. భూషామౌక్తికకాంతి దేహరుచితోఁ బోరాటమాడన్ మరు
ద్యోషాగత్నకిరీటరుఘాటసుషమాయోయుజ్యమానాంఘ్రి ని
శ్శేషశ్రీ విరివమ్మిగద్దియ సమాశ్లేషింపఁ గొల్వుండు నా
భాషాదేవిఁ దలంచెదన్ రసలసద్భాషావిశేషార్థినై. 7

ఉ. చెక్కుటఁ బత్త్రవల్లరి సృజింపఁగఁ బూని మనోజకేళి నా
యక్కఱ దీర్పవే యనుచు నక్షరపంక్తి లిఖింపఁగాఁ దన
న్యక్కృతకైతవంబు హృదయంబున నారసి ప్రాణనాథుతో
నొక్కపిసాళినవ్వు ననలొత్తఁగ నవ్వేడువాణిఁ గొల్చెదన్. 8

ఉ. శుష్కవచశ్శిలాతతుల సూటిగఁ జూచి మహాకవిశ్రవ
శ్శష్కులికావిదారణము సల్పఁగ నేర్చినజాణలార మీ
ముష్కరతాసమున్నతికి మ్రొక్కెద నాయెడఁ జూపరాకుఁడీ
దుష్కవులార సాధుజనదూషణభూషణభూషితాత్ములై. 9

క. అని యిట్లుదేవతాప్రా, ర్థన మాపాదించి గురులఁ బ్రణుతించి పురా
తనకవుల నెంచి దుష్కవి, జనపశువుల నోసరించి సమ్మదమొదవన్. 10

వ. ఏ నొక్కమహాప్రబంధంబు సేయ నూహించియున్న సమయంబున. 11

సీ. శార్దూలచర్మమో జాళువాచేలయో, కాని నిద్దపుమేనఁ గట్టినాఁడు
కమనీయభస్మమో గంధచూర్ణమొకాని, వాసనల్ వెదఁజల్లఁ బూసినాఁడు
ధవళభుజంగమో తారహారమొకాని, మృదుతరగ్రీవ ధరించినాఁడు
తతజటాజూటమో ధమ్మిల్లమోకాని, పొలుపార నౌదలఁ బూనినాఁడు
గీ. చంద్రఖండంబొ పుష్పగుచ్ఛంబొ కాని, మూర్ధసీమ నతిప్రేమ ముడిచినాఁడు
జంగ మొక్కఁడు నిర్జితానంగమూర్తి, నిదురవోవంగ వచ్చి నాయెదుర నిల్చె. 12

క. నిలిచినఁ దచ్చరణాంబుజ, ములకు ననేకప్రణామములు సేసి కృతాం
జలినైన నన్నుఁ గని కో, మలవిరళగభీరధీరమధురోక్తులచేన్. 13

వ. కవీంద్రా సమ సరసనిస్తంద్రంబుగా నీవు సృజింపంబూనినకావ్యకన్యకాలలామంబున

కుంకుమగా నాయురారోగ్యమహాభాగ్యంబు లొసంగెడు నమ్మం బరిణేతం జేయు మని యానతిచ్చెఁ దదనంతరంబ. 14

క. తలతల మెఱచెడుకటితోఁ, దెల తెలవాఱంగ లేచి తెలియఁగ నపు డా
కలచందము నామనమునఁ, గలచందము నొక్కమైనఁ గడువేడుకతోన్. 15

ఉ. ముంగలనిల్చి సర్వజనమోహనదేహనవీనకాంతివి
స్ఫారం గరుణానిరీక్షణపరంబుగ నీగతిఁ బల్కినట్టియా
జంగమసార్వభౌముని భుజంగమభూషణుఁ గా నెఱింగి యు
ప్పొంగి తరంగితప్రమదపూరితమానసపంకజుండనై. 16

ఉ. నామది నెప్పుడుం బ్రమథనాయకు నిష్టసుఖప్రదాయకున్
సోమశకిరుదానవసమూహశరారుఁ గృతీశుఁ జేయఁగాఁ
ప్రేమజనించు నాదరణపేశలుఁ డమ్మహనీయమూర్తి యే
మామకభాగ్యసంపదనుమాసముదంచితవామభాగుఁడై. 17

గీ. ఇచ్చి కృతికన్యకాసముద్వాహమునకు, శుల్కముగ నాయురారోగ్యసుప్రసిద్ధు
లిత్తునని యల్లుఁడగుటకు నిచ్చగించె, నింతకంటెను సౌభాగ్య మెందుఁ గలదె. 18

ఉ. కోమలసద్గుణోమయుని గోవిదసంస్తవనీయలక్షణ
స్తోమఫలాభిరాముని శుంభదలంకరణప్రసాధన
స్థేముని నప్రతర్క్యగుణసీముని నైనమదీయకావ్యక
న్యామణి నిచ్చి మంచుమలయల్లుని నల్లునిఁగా నొనర్చెదన్. 19

సీ. తలపై వియద్గంగ గలుగునిత్యస్నాత, కైలాసగిరిదుర్గ మేలు నేత
త్రిపురంబు లొకకోలఁ ద్రెళ్లఁ జేసినవాఁడు, కందర్పుఁ గెల్చినయందకాఁడు
పాపరాఁ దాల్చినపయఁడు విక్రమరంహుఁ, గరిదైత్యుఁ బొరిగొన్న పురుషసింహుఁ
డంబుజాక్షికి దేహ మర్ధ మిచ్చినదాత, కలితసారుఁ గుమారుఁ గన్న తాత

గీ. మదవదరివరిద్రాణవోర్దండలాగ్ర, జాగ్రదసురాగ్రచరనిహింసనవిశాలు
శూలిరాజపరిష్కార్యశూలినామ, ధన్యుఁ డష్టుండు కాఁడె మత్కావ్యమునకు. 20

వ. అని యుద్దేశించి. 21

## షష్ఠ్యంతములు.

క. దుస్సాధుప్రధనసుధా, భిస్సారిబలాతిరేకభిదానునకున్
నిస్సీమకామదోహిప, యస్సురధేనునకు నాశ్రితాధీనునకున్. 22

క. ధూపాయితగోపాయిత, పాపాయితదనుజసుకృతభాసితవనుజా
టోప్పున కగజాపున కగ, చాపున కాసక్తభక్తసల్లాపునకున్. 23

క. శంగత్కరుణారసహృద, యంగమభృంగాయమాన లతాంతాయుధహా

సాంగారుచ కాశ్రితగిరి, శృంగాయన కపరిమేయశృంగారుచకున్. 24

క. కటకాయితఫణికి శిఖా, గతశీతలఘృణికి నర్ధకాంతామణికిన్
గుటిలాఖిలవసుజగజ, స్ఫుటనకశాస్త్రణికి దేవచూడామణికిన్. 25

క. ప్రేయస్మితగల్లునకున్, సాయకముఖవళితరాత్రిచరమల్లునకున్
గాయజగురుభల్లునకున్, మాయాభిల్లునకు మంచుమలయల్లునకున్. 26

క. కాశీపట్టణముఖ్యుని, వేశున కవనీశసౌధవేశునకు వియ
త్కేశునకుఁ గంధపురసో, మేశునకుఁ బ్రభానిరస్తహిమకాశునకున్. 27

వ. సముజ్జ్వలాలంక్రియాభిరామంబుఁగా నాసమర్పింపంబూనిన నిరంకుశోపాఖ్యానం
బనుకృతికన్యాలలామంబున కాజన్మకథ యెట్టిదనిన. 28

మ. అసహాయాపరిమేయదుర్జయబలాహంకారదుర్వారవై
రిసహస్రప్రతిసుప్రమారణచణోద్రేకాసివిద్యుత్సము
ల్లసనానంతరజాయమానమహితద్రాఘిష్ఠగర్జాఘనుం
డసమానాకృతి ధర్మశీలుఁ డమరా జత్యంతసంతుష్టుఁడై. 29

క. కొలువున్నయెడనుఁ దపని, ర్మలతేజము సూర్యతోడ మూర్మలయుంగా
పులహుఁ డనుమౌని నిర్గత, కలహుఁడు చనుదెంచె శిష్యగణసంవృతుఁడై. 30

క. చనుదేర నెదురు గాఁజని, మునిసింహుని నర్ఘ్యపాద్యముల సంతుష్టా
త్మునిఁ జేసి రత్నసింహా, సనమునఁ గూర్చుండ నునిచి సవిధక్షోణిన్. 31

వ. తాను నొక్కసముచితాసనంబునం గూర్చుండి ప్రసంగవశంబున ని ట్లనియె. 32

సీ. అఖిలశాస్త్రములందు నడిగినతా వెల్ల, నిదమిత్థ మని తెల్ప నెవ్వఁ డోపుఁ
దెలిసి ధర్మాధర్మములు పాలునీరు నే, ర్పఱచిన ట్లెవ్వఁ డేర్పఱపనేర్చు
నమరాదికమనీయ మగుతపస్సామ్రాజ్య, పట్టంబు నెవ్వాఁడు కట్టుకొనియె
లోకంబునకు దురాలోకంబు బ్రహ్మైవ, లోక మెవ్వాఁడు సేయు లోకమందు
గీ. మీరు దక్కంగ నో త్రిలోకీరహస్య, కర్మమర్మవివేకజంఘాలవృష్టి
ఘాలలోచనపరభక్తిపారవశ్య, దళితకామాదిరిపువర్గకలహ పులహ. 33

క. ఒకవేదమొ యొకశాస్త్రమొ, యొకధర్మమొ యొక్కనయమొ యొకవినయంబో
యొకశమమొ యొక్కదమమో, సకలము నీయందు కలవు చాతుర్యనిధీ. 34

ఉ. ఓమునిసార్వభౌమ సుజనోత్పలశీతలధామ వాక్ఫణి
స్వామి తలంక నేము మది సందియ మొక్కటి విన్నవించెదన్
దామరసాక్షకీర్తనము తత్త్వరహస్యము యిస్సిగో యితం
డేమి తలంచె నిప్పు డని యెన్నకుఁడీ మిముఁ జాల వేఁడెదన్. 35

క. వ్యసనములలోనఁ బ్రథమ, వ్యసనము సంభోగకాంక్ష యదిదోషములీ
వ్యసన మనఁగ విందు నందుం, బ్రసరించినవాఁడు పాపబాహ్యుఁడు కలఁడే. 36

క. నా విని మునిశేఖరుఁ డో, భూవల్లభ వెఱవ నేల బుధసంస్తుత్యం
బీవాక్య మేమి యల్పమె, నీవడిగినయంత మోహనిర్ణిద్రుఁడవే. 37

చ. అడిగిననేమి దోసమె సమస్తధరాతలనాథ కోరికల్
నుడువుల నున్నవే మనసులోపలఁ గాక రతిప్రసంగముల్
దడవనియంతమాత్రనె విదారితమోహుఁడె యీవిచారముల్
విడువుము వాగ్విశేషమును విశ్రుతవేషము మోక్షహేతువే. 38

క. కావున విచారమేటికి, భూవర విను సకలదోషములకు నిరాఘా
టావాసమౌనె కడుకరు, ణావేశధురీణచిత్తుఁడైన ధరిత్రిన్. 39

చ. కలుషసుమీ మనోజశరకంపితధైర్యశరవ్యులై తలం
పుల వచనంబులం గ్రియల భోగవతీజనమంద యిచ్ఛ ని
చ్చలముగఁ బూని తిక్కినవిచారము దూరముఁ జేసినట్టిమొ
క్కలపుమనుష్యులుం బుధులు గాననిసద్గతిఁ గన్నవారలన్. 40

మ. అది యీజన్మమునందుఁ జేసినవివేకాయత్తసద్వృత్తసం
పదకాదో నరపాల పూర్వకృత మామాహాత్మ్యవిస్ఫూర్తి యొం
తదురాచారధురీణుఁ డైనఘసంతాపంబు రాదేని య
మ్మదనారాతికృపావిపాక మది సంభావ్యంబు వాఁడేరికిన్. 41

వ. దీని కొక్కయితిహాసంబు కలదు చెప్పెద సావధానాంతరంగుఁడ వై విను మని యిట్లు చెప్పందొడంగె. 42

---

## కథాప్రారంభము.

సీ. కమలాకరము తోటఁ గమలాకరము తోట, జలజాతవిస్ఫూర్తి తెలియఁబడక
రాజమండల మాట రాజమండల మాట, కువలయప్రియవృత్తి వివరపడక
మాణిక్యచయ మాట మాణిక్యచయ మాటఁ, గ్రొత్తడాలుసెలంగ గుఱుతుపడక
యమరదీర్ఘిక తోట నమరదీర్ఘిక తోట, ఘనసువర్ణాబ్జత గానఁబడక

గీ. గోపురము తోట మణిమయగోపురంబు
తోట గురుసమున్నతిమెయిం దేటపడక
ద్వాపరంబున విలసిల్లుద్వాపరంబు
గరిమఁ దనరారు మాణిక్యపుర మనంగ. 43

శా. మాణిక్యక్రియమాణసౌధసుషమామాయాసరిత్త్రస్తకా
మైణాక్షీసహభీతిసంభ్రమభరవ్యాలోకమానాభ్రగా
క్షీణానర్గళహాసభావివళితస్ఫీతాంధకారత్రియా
మాణూభూత్రసితాన్యపక్షతతికం బాపట్టణం బల్పమే. 44

సీ. వైడూర్యకల్పితద్వారదీప్తులు పుష్య,రాగకవాటజప్రభలఁ బెనుప
మరకతకుడ్యసంపాతిదీధితి మహా,నీలవేదిశ్రీకి నెనరుఁ జూపఁ
బద్మరాగోజ్జ్వలప్రాసాదరుచి విద్రు,మస్తంభకాంతుల మమతఁ బ్రోవఁ
వజ్రకుట్టిమశోభ వరమౌక్తికస్యంద,నచ్ఛాయ కేప్రొద్దు నట్టు సేయ
గీ. దీప్రగోపుర,గోమేధికప్రకాశ
మనుదినంబును దనకుఁ దో డభిలషించు
నిఖిలమణిసంపదలు నందు నెరయుకతన
మణిపురం బండ్రు దానినామము నృపాల. 45

క. గురుతరము తత్పురాంతర, ధరణీసురశాస్త్రకోవిదత్వం బాహా
గురుతరము గాదు నారద, గురుతరముం గాదు వారిఁ గూడి వచింపన్. 46

సీ. అత్యంతబాల్యంబునందె విశ్వామిత్రు, లాశ్చర్య మొందుశౌర్యంబుఁ జూపి
యుజ్జ్వలకాంతిచే నుగ్రధర్మ మడంచి, మహిజనాశ్రయసత్యమహిమఁ బొంది
యాజగమానితమగు మహావని నెల్ల,ర్పచు సమున్నతమగు రూఢిఁ జెలఁగి
యతులగంభీరత నంభోధి లంఘించి, గరిమ నలంకారకలితు లగుచు
గీ. స్వప్రగల్భతఁ బౌలస్త్యజయముఁ గాంచి, కుజనవారణలీలఁ గైకొని యయోధ్య
బలసమగ్రతచేఁ బట్టభద్రులైరి, రామవిభు పౌర యప్పురి రాజవరులు. 47

క. ఇచ్చెద నని సురశైలముఁ, దెచ్చియు శోధించి విలువఁ దీర్పఁగ నడుగన్
బుచ్చుకొనఁ దిరుగ నమ్మఁగ, వచ్చుటఁ గలవైశ్యులందు నధముఁడె చాలున్. 48

క. అందరుదారుజఘన్యజు, లందఱు దారుణబలాఢ్యు లగుదురు ధృతిచే
మందరము లయ్యుఁ దెలియవ, మందరము ల్వింత గావె మహిమండలిలోన్. 49

సీ. చెక్కుటద్దములపైఁ జిఱునవ్వు చినుకులు, వాఱ మోవి చలించుపాటఁ బలికి
కనుఱెప్ప లరనంచి కర్ణాంతములు దాఁట, నలుసాల నృత్యంబు దొలుకఁ జూచి
కొదమజక్కవపంటి గుబ్బచంటికెలంకు, గాన రా జిలుఁగుఁజెంగావి గప్పి
కచభారకుచభారకటిభారములచేతఁ, గాయంబు త్రైభంగికముగ నిలిచి
గీ. ప్రియవయస్యాభుజాసమర్పితకరాబ్జ, లగుచుఁ దమయిండ్లముంగిళ్ల నప్పురమున
విటులతో మాటలాడెడువేలవెలందు, లన్యవేశ్యలఁ గొలందులా జయింప. 50

ఉ. ఒక్కొకవేళ దేవపతియొద్దకు నారదుఁ డేగుదెంచి యా
జక్కవగబ్బిగుబ్బెతలచక్కఁదనంబును నాట్యవిద్యయున్
ముక్కువసేఁతలున్ విటులమర్మ మెఱుంగుటలుం గణింపఁగా
గ్రక్కున దేవలోకగణిక ల్తలవంతురు సిగ్గుపెంపునన్. 51

ఉ. దండకు నేగుదెంచి విరిదండకు విల్వయొసంగి పుష్పకో
దండనిశాతమార్గణవిదారితభావముఁ జెందలే మయో
దండను నీకు నోయబల దండము దండము దండ మంచు దో
ర్దండము లెత్తి మ్రొక్కుదురు ప్రక్కలఁ గన్గొని పౌరపల్లవుల్. 52

గీ. ప్రకటకటకంబు పాదవిభ్రాజితంబు
లైనయగసంఘ మని చూచి యచలభావ
హైన్యమున నాగసంఘాత మంద్రు సుకవు
లచటిమదకుంజరముల నేమని నుతింతు. 53

క. మనసైన నీడుగుజ్జముఁ, గనుఁగొనలే రచటిఘోటకములకు భువిలో
మన సైన నీడు గా దా, యనఘునిరాఘాటజవను గ్రతచేతన్. 54

క. ఒకకొన్ని మదికిఁ దోఁచినఁ, బ్రకటించితిఁ గాని యచటిబహువస్తుసమృ
ద్ధికిఁ శతపత్రసంభవు, నకు నైన గణింపరాదు నరనాథమణీ. 55

క. ఆపురమునందుఁ జేయుం, గాఁపురము సమస్తజనులుఁ గణుతింప బుధ
క్ష్మాపతి మతి రెండవభా, షాపతి సురశర్మ కర్మసౌష్ఠవగురుఁ డై. 56

శా. చాతుర్వైద్యపరాయణుండు బహుశాస్త్రగ్రంథనిర్ణేత వి
ఖ్యాతాచారధురంధరుండు హరిపాదాంభోజసేవాకలా
సాతత్యప్రథితుండు లక్షణవిరాజత్కావ్యసన్నక్రియా
ద్వైతీయీకసరోజసూతి యతఁ డేతన్మాత్రుఁడే భూవరా. 57

క. పరకాంతాముఖదోషా, కరకాంతిస్పర్శనమునఁ గడుమొగుడుచు నా
ధరణీసురు నేత్రంబులు, సరసీజము లన్న మాట సహజము గాదే. 58

శా. శిష్టత్వంబున వేదశాస్త్రపఠనశ్రీచేత నాధాతకుం
దృష్టింపంగ నశక్యుఁ డైన ధరణీదేవోత్తమున్ శ్రౌతని
ర్దిష్టాచారధురంధరత్వమున నార్త్విజ్యంబు సల్పంగ న
గ్నిష్టోమాదులు సేసె నాతఁడు భువిన్ గీర్వాణసంతుష్టిగన్. 59

మ. అతిభక్తిం గృహిణీలలామము పదవ్యాసంగచంగాత్మ యై
ప్రతివారంబును భక్ష్యభోజ్యములు సంపాదించి వడ్డింపఁగా

నతిథుల్ భోజన మాచరించి సుఖులై యాశీర్వదింపంగ నా
చతురాస్యాన్వయవార్ధిచంద్రమునకుఁ సంతోష మెంతో యగున్. 60

ఉ. ఎంత కృపావిపాకభర మెంతనిరంతరధైర్య మాదరం
బెంత వివేక మెంత భయ మెంత ససమ్మదభావ మెంత యా
శాంతమనస్కమౌళికి నిశాంతముఖం ధరణీసుపర్వు ల
శ్రాంతము భోజనోత్సవము సల్పితిఁ గణనాధికంబుగన్. 61

సీ. అభ్యాగతారాధనాపాద్యమానార్ఘ్యపాద్యపాధ-పూరపంకిలంబు
భోజనానంతరభాజనస్రుతఘృత, స్వచ్ఛమధుద్రవపిచ్ఛిలంబుఁ
బరిశీలితాగమోపన్యాసపరశిష్య, బృందవాక్సందర్భతుందిలంబుఁ
గాంచనవేద్యలంకారచూర్ణాయిత, ప్రకటితకర్పూరసికతిలంబు
గీ. దేవపూజావసరసముద్దీప్యమాన, చారుమణిరంగవల్లికాశర్కరిలము
మహిప నుతిసేయఁ జెల్లదే యహరహంబు, నాతనిగృహంబు సకలభాగ్యావహంబు.

క. అల రెండువేలజిహ్వాలుఁ, గలవానికి నైనఁ దరమె గణుతింపఁగఁ ప
జ్జలజాసనకులజార్పిత, కలమాన్నసమోదవేదగర్భశ్రేణిన్. 63

క. అది యెంతైనను గలదో, కదనజయాధార తజ్జగన్నుతమహిమా
స్పదచరితుఁడు సుతిహీనత, మదిచింతిలు టెంతవారు మానరుసుమ్మీ. 64

గీ. విప్రుఁ డింటికి వచ్చిన విమలభక్తి
నన్నదానాదు లొసఁగి నెయ్యమునఁ జేరి
యయ్య పుత్రులు మీకెంద అనుట గాని
యితర మేమియు నడుగఁ డాత్మీతిసురుండు. 65

సీ. నందనుం డాత్మాభినందనుండై ముద్దుమాటలఁ గరఁగింప మలయువారిఁ
దనయుండు సముదంచితినయుఁడై చదువ నాగమపురాణాదులు గఱపువారి
సూనుండు వాక్యప్రసూనుఁడై పెద్దలఁ, బూజింపఁ వేడుకఁ బొందువారిఁ
నాత్మజుం డధికమాపాత్మజుండై భార్య,యును దాను మెలఁగంగఁ దనరువారిఁ
గీ. జూచి హరికృష్ణ బ్రహ్మాదిసుతులఁగాంచి, నట్టి త్రైలోక్యగురుని దేవాధినాథు
నిన్ను సేవించువారికి నిస్తనూజ, భావమా యంచుఁ జింతించు బ్రాహ్మణుండు. 66

ఉ. ఏమిజపంబుఁ జేసిరొకో యేమి తపంబొనరించిరొక్కొ యే
మేమి సపర్య లార్యతతి కిచ్చిరొకో జగదేకపూజ్యులై
తామఁ దనూజరత్నములఁ దామరతంపరయై చెలంగువా
రీమహిఁ దొల్లి యంచు నుతియించు మహీసురుఁ డాత్మలోపలన్. 67

ఉ. ఓరమణీమనోభవ సమున్నతదుష్కృతదావపావకా

సారము పుత్త్రుఁ డా ప్తవసచ్చైత్రుఁడు గల్గమి నంచ లేనికా
సారముపోలె నాసరసిజప్రభవాన్వయవార్థిచంద్రుసం
సార మసార మై మిగుల సన్నుతి కెక్కకపోయె దుస్థితిన్. 68

మ. నరలోకంబునఁ గల్గుతీర్థముల మాన్యప్రక్రియం గ్రుంకనీ
నరకక్లేశనివారకంబు లగునానాక్షేత్రముల్ ఘెట్టనీ
యురరీకారముతోడ యజ్ఞములు వేదోక్తంబుగాఁ జేయ నీ
పురుషుం డాత్మజహీనుఁడై సుగతికిం బోనేరఁ డుర్వీశ్వరా. 69

సీ. సిద్ధాంజనము వేఱె సిద్ధింపవలయునే, పుత్త్రుండు గలిగిన భూవరేణ్య
సురమహీజము వేఱె దొరకంగవలయునే. తనయుండు గల్గిన మనుజనాథ
యమరరత్నము వేఱె సమకూఱవలయునే, తనయుండు గల్గిన ధారుణీశ
దైవధేనువు వేఱె దక్కఁగవలయునే, సూనుండు గల్గిన మానవేంద్ర

గీ. సుతుఁడు గల్గినఁ బరలోకసుఖముఁ గాంచు
నాత్మజుఁడు గల్గఁ గుల మెల్ల నతిశయిల్లుఁ
గొడుకు గల్గిన ఋణశుద్ధిఁ బడయవచ్చుఁ
బరమసుఖకారణము తనూభవుఁడు సువ్వె. 70

క. కొడుకులు లేనిమనుష్యుఁడు, విడిముడి గలఁడైనఁ గంటె విశ్వములోనన్
గొడుకులు గల్గిన మనుజుఁడు, బడుగైనను మేలు కుముదబంధుకులీనా. 71

క. కావునఁ దనయావాప్తికి, భావమ్మున నమ్మహానుభావుఁడు ధరణీ
దేవుఁడు వతగతిశ్రీయా, పావల్లభు దూఱ నతనిస్వప్నమునందున్. 72

ఉ. ఓనియమానుషంగ భవనోన్నతభాగ్యతరంగ దీనర
క్షానిపుణాంతరంగ సుతుఁ గాంచెదు చంచదుపాయశాలి భా
షానతసర్వమాళి హితసారసహేళి నటంచు నిందిరా
ప్రాణసఖుం డొసంగె ఫలరాజము నద్భుతదివ్యతేజమున్. 73

వ. ఇట్లిచ్చిన. 74

మత్తకోకిల. లేచి యంతను మున్నె మేల్కని లీల నాస్యపదద్వయీ
సేచనాదులు దీర్చి ధౌతపుఁజీరఁ గట్టి రయంబ కా
లోచితం బగుగేహకృత్యము లోలిఁ జేయుసతీమణిన్
జూచి యిట్లను వింటివే యిఁకఁ జోద్యపుంగల యంగనా. 75

ఉ. ఓకలకంఠకంఠి జలజాంబకుఁ డాదరపూర్ణచిత్తుఁడై
నాకలలోన వచ్చి నలినప్రభవాన్వయ చింత యేటికిన్
నీకొకపుత్త్రుఁ డార్యమహనీయచరిత్రుఁడు గల్గు నంచు ల

త్రీకుచగంధలిప్త మగుచేత ఫలం బొక టిచ్చె నావుఁడున్. 76

క. మనపాలిట నున్నాఁ డా, వనరుహలోచనుఁడు లోకవంద్యుఁడు లేకుం
డిన వచ్చునె దయ నిట్టి,చ్చుని పక్వం బైనఫలము సుతఫల మనుచున్. 77

ఈ. ఓసరసీరుహాసనసులోదధికల్పమహీజ భక్తర
క్షాసముదగ్రమానసుఁడు శౌరి దయాగుణహారి మీ నిది
ధ్యాసకుఁ జాల మెచ్చి వరదాన మొసంగె నొసంగఁ జెల్లదే
దాసులఁ బ్రోచుచింత మురదానవహంతకు నేఁడు వింతయే. 78

సీ. అన్న చేఁ బరిభూతుఁ డగుదైత్యుఁ గాచిన,శరణాగతత్రాణపరిచయంబు
మకరపీడిత మైనమదవంతిఁ బ్రోచిన,యార్తరక్షాసముద్వృమనిరూఢి
తండ్రి నిర్బంధింపఁ దనయు రక్షించిన,భక్తలోకాధీనభావరేఖ
రారాజువలన ధర్మజు నుద్ధరించిన,యాశ్రితపక్షపాతానువృత్తి

గీ. మఱచెఁ గాఁబోలు ననుచు నవ్వారె సమస్త, జనులు ననపత్యదురితదుస్సహసమీర
సముదయోద్ధూతచేతోంబుజాతబుగవి, నీతు మిమ్ముఁ గావకున్న నోనిర్మలాత్మ. 79

క. అక్కమలాక్షుం డాద్యుఁడు, ఎక్కడఁగఁ బోషకులు గలరె తలపోయంగా
నిక్కల నిక్కల సందియ, మొక్కంతెయు లేదు కోర్కె లొనఁగూర్చుఁజుఁడీ. 80

చ. అని యనిరోధబోధమహిమాన్వితమానస గాన యాదళ
ద్వనజదళాక్షి భర్తఁ గలవాక్కులనంబునఁ దేర్చి మించి య
త్యనుపమితాన్నదానవిభవాతిశయంబున విప్రకోటులన్
దనుపుచు నెప్పటట్ల సముదగ్రత నుండఁగఁ గొన్నినాళ్లకున్. 81

క. శరణాయితభరణాయతి, కరుణారతుఁడైన దనుజఘస్మరుకృపచేఁ
దరణి భరియించు ప్రాగ్దిశ, కరణిన్ భూసురునితరుణి గర్భముఁ దాల్చెన్. 82

క. నలుపెక్కెం జనుముక్కులు, తెలుపెక్కెన్ జెక్కు లారు తీరువహించెన్
బలిసె నునుగౌను శశికళఁ, గెలసెన్ నెమ్మేన గమనఖేలన మొలసెన్. 83

గీ. వామలోచన మధ్యంబు లేమిచేతఁ, జాల కృశమై రమామనస్స్వామికరుణ
గలిగి నప్పుడె యభివృద్ధిఁ గనియె నౌర, హరికటాక్షేక్షు దారిద్ర్యహరణదీక్ష. 84

గీ. పొలఁతు లెల్ల మెచ్చ భూమిభృత్సారంబు, సంగ్రహించె విప్రసారసాక్షి
యద్దిరయ్య వింత యోఁడురాజకులంబు, నిర్వహించె సతు లఖర్వమతులు. 85

మ. హృదయేశ ప్రమదంబుతోఁ గుచయుగీహారాళినీలత్వసం
పదతో నాననపద్మపాండిమముతోఁ బ్రస్తూయమానాంగరా
గదుకూలాదిజుగుప్సతో జడిమతోఁ గార్శ్యంబుతోఁ బ్రావృడం

బుధకల్యాణకగర్భ ముద్ధుగ్ధరాపూర్ణత్వముం జెందఁగన్. 86

క. అమృతపయోధిబలాహమం, బమృతకరుం గాంచినట్లు హరికృపవలనన్
సుముహూర్తంబున భూసుర, రమణీరత్నంబు పుత్త్రరత్నముఁ గాంచెన్. 87

క. వైదికశేఖరునకుఁ బు, త్త్రోదయకాలమ్మునందు నద్భుతములతో
మేదురపులకాంకురములు, మోదాంభంబునను మొలకలవోలెన్. 88

వ. ఇట్లపరిమితసంతోషసంతర్పితాంతఃకరణుండును సంభృతసమయాసమానేయసముపరత
కరణుండును పుత్త్రోత్సవసమాలోకనోత్సాహసాహచర్యసమాయాతసమీపగ్రామ
సకలగోత్రామరసన్నిధిసంజల్పితహరిప్రసాదప్రసంగుండును గలితకర్పూరతాంబూల
దానసంతోషితసామంతసీమంతపురంధ్రీజనపరంపరానిరాఘాటకోలాహలశ్రీప్ర
సాదితగృహాంగణరంగుండును భూరిదానచణుండును నై పెన్నిధానంబుఁ గన్నపేద
చందంబున మేఘోదయంబుఁ గాంచినమయూరంబుకరణి కోమలవలాహకంబుఁ
గనుంగొన్నచాతకంబుకైవడి హరిప్రసాదంబు నాలోకించుయోగీశ్వరునిపోలిక
నభినవభానుబింబంబు వీక్షించుకమలాకరంబువిధంబునఁ బూర్ణచంద్రు దర్శించుకల
శాంబుధితెఱంగునఁ సరోవరంబు నిర్వర్ణించుతర్షకునిమాడ్కిఁ ఫలితసహకారంబు నిధ్యా
నించురాజకీరంబువడువునఁ బ్రియనందన సందర్శనానందకందళితుందిలహృదయార
విందుండై యావిజ్ఞానస్వచ్ఛందుండు జాతకర్మంబు యథాశాస్త్రంబుగా నిర్వర్తించి
తదనంతరంబ. 89

గీ. పదిదినంబులఁ సూతకప్రాప్తిఁ గడపి, పదునొకండవనాఁ డఘాపహజలాభి
షేక మొనరించి బాంధవనైకపరివృతాత్ముఁడై యుండు నతనితో నవనిసురులు. 90

మ. అశనప్రగ్రహదానధర్మసుదశర్మాకర్మిసంపన్న పం
చశరాకారుఁడు నీకుమారుఁడు వచస్సంభారదుర్వారుఁ డై
విశదానర్గళశేముషీమహిమచే వేదాదివిద్యానిరం
కుశుఁ డౌనన్న నిరంకుశుండె యనియెన్ క్షోణీసురుం డాఖ్యయున్. 91

క. ఈరీతి నమ్మహీసురుఁ, డారూఢచరిత్రపాత్రుఁ డగుపుత్త్రునకున్
పేరొసఁగె నాణిముత్తెపుఁ, బేరొసఁగిన కీర్తి బుధులు పేరుకొనంగన్. 92

క. అన్నప్రాశన చౌలము, లున్నతిఁ గావించెఁ జేసె నుపనయనము వి
ద్వన్నుతుఁ డెసఁగఁ దనూజున, కన్నలినాసనకులీనుఁ డాగమసరణిన్. 93

మ. చదివించెం ద్రయివాక్యముల్ గఱపె శాస్త్రంబుల్ పఠింపించె సా
మ్యదవిమ్షప్రతిభం గవిత్వము రచింపం జేసె గానక్రియా
విధురుం గా నొనరించె వైదికకులావిఖ్యాత నాకారసం
పదుపేతం గుణధన్యఁ గన్యఁ గరమొప్పం జేసె నుద్వాహమున్. 94

గీ. అనిన విని ధర్మశీలుఁ డో మునివరేణ్య, విప్రతనయుండు వేదాదివిద్యలందుఁ
జతురుఁడై మించె నట్టి శైశవమునందె, యమ్మతంబందెఁ దద్వార్తలానతీవె. 95

శా. గంధర్వీకృతశృంగిరాజ సురగంగాబద్ధకేశా సుధా
ద్గంధర్వీకయశోవిపాక కరుణాధన్యావలోకా లస
త్కంధిస్థాపితకాలకూట విరమద్దైత్యారిఘోటప్రమా
దాంధంభావుక సింధురాసురరిపు ప్రాణోపహారాస్పదా. 96

శా. కార్ష్ణిబంధురకంఠమన్మథదిధక్షానక్షపీక్షా శిఖా
తార్ష్ణ్యజ్వలదంబకజ్వలనసిధ్యత్పావనసేవా కళా
తార్ష్ణ్యాద్యస్తవగమ్యవాంఛితనితాంతస్వాంతమందారకా
పార్ష్ణిస్థానవిభాసమానమధుహబ్రహ్మాదిబృందారకా. 97

క. కవిత్వముఖకేళివసనం, భవిత్వవచఃకుసుమపూజ్యపదయుగనమున
స్సవితృహరిణాంకలోచన, భవత్తృష్ణాహరణచణా కృపాపరిపూర్ణా. 98

పంచచామరము. చరాచరాదరానుయుక్త సాధులోకవజ్రపం
జరా జరానిరాసిదేహ సత్యనిత్యవాక్ప్రియం
కరా కరాళరాక్షసాపకార క్ష్మాహనక్రియా
పరా పరాశరాదిమౌనిభక్తియుక్తితత్పరా. 99

గద్య. ఇది శ్రీమత్కాశీపరప్రసాదలబ్ధలబ్ధవర్ణవర్ణనీయకవిత్వధారేయ పెదలింగనార్య గర్భార్ణవపూర్ణిమాత్రేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమాన సకలవిద్వజ్జన విధేయ రుద్రయనామధేయ ప్రణీతం బయిన నిరంకుశోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# నిరంకుశోపాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీపతిసాయక సుమన
స్త్రీపద నిర్ఘాతశమనసింధురవరదై
త్యాపహ హిమవద్భూభృ
ద్భూపాలసుతేశ కందపురసోమేశా. 1

గీ. అవధరింపుము తత్త్వవిద్యావివేక, దళితకామాదిరిపువర్గకలహుఁ డైన
పులహుఁ డిట్లని పల్కె నాభూవరేణ్య, శేఖరునితోడ నవనవైచిత్రి మెఱయ. 2

క. వినుభూపాల ధరాసుర, తనయునిమహిమంబు లెన్నఁదరమా విద్యా
వననిధి హరివరలబ్ధుం, డనఘాత్ముఁడు తొల్లిజన్మమం దని తెలియున్. 3

సీ. వేదముల్ ద్రుహిణాననోదయం బగునాఁటి, కొదువఁ దీర్చుకొనుటకొఱకు వచ్చె
నన శాస్త్రములు వాని వెనువెంట నంటును, సందియంబులు దీర్చుకొందు మంచు
వచ్చెనో యనఁగను వానివీఁకనె పురాణములును సంశయాంశములు వీడ
వచ్చెనోరా యన వరగుణప్రౌఢిమ, తావచ్చి ప్రౌఢగాఁ దలఁచె ననఁగఁ

గీ. జనువఁజూడఁగ నిన మది కొదువునంత, వేదశాస్త్రపురాణాదివిద్యలెల్లఁ
దనకె హరిలబ్ధ మగునట్టిజననమహిమ, వాని కేమిటఁ గొదు వెన్న నిశమె భూప. 4

క. అదిగనుక నన్నివిద్యలు, పదఁపడి చతురత్వ మొందెఁ బాల్యమునందే
మొదల హరిమహిమ వానికిఁ, బిదపన్ హరిజన్మబలము పెనఁగొనె నట్టులన్. 5

చ. ఉడుపతిజాటజూటసరిదుద్యదభంగతరంగనిస్వనా
జడిమపరాభవిష్ణుతరశబ్దసమగ్రత నాఱుశాస్త్రముల్
తడయ కుపన్యసింప విబుధప్రకరంబులు వచ్చి సందియం
బడుగవలేవు ధీకృతికి నర్హులు లేరు ధరాతలంబునన్. 6

క. ఈరీతి నతఁడు విద్యా, పారీణత సంగ్రహించి బాల్యమునందున్
జాయతరకీర్తి దిక్కుల, నాహ్లాదిగఁ బర్వఁజేయ నాసమయమునన్. 7

ఉ. భూవలయంబునం గలుగుభూసురసంఘము లేగుదెంచి వి
ద్యావిభవంబు చూచి యితఁ డంబుజహాసనమూర్తి గాక భూ
దేవకుమారుఁడే యని మదిం దలపోయఁగ నంతలోపలన్
యౌవన మంకురించె వసుధాదివిజప్రకుమారమౌళికిన్. 8

గీ. బాల్యసంపూర్ణభావంబు పాయఁబాయఁ, దరుణయౌవనలక్ష్మి నర్తనము సూపె
నధికతరమైన తెరతీసినంతలోనె, చిత్తరముఁ జూపుపాతరకత్తె పోలె. 9

సీ. తొలుతఁ దుమ్మెదలతోఁ దులదూఁగునెఱికురు, లేరీతి నుండుఁ గౌమారవేళ
మునుపు తామరలకు మొనఁజూపుతెలికన్ను, లేవిధంబున నుండు యౌవనమున
మొదలఁ జందురునందుఁ గొదువ లెన్నెడునాస్య,పద్మమేగతినుండుఁ బ్రాయమునను
మున్ను బంగారు పెంపు హసించుదేహ మే,వైఖరి నుండు మేల్వయసునందు
గీ. నీవె తలఁపోసి చూచుకొమ్మా వివేక, శీలు నే వర్ణనము సేయఁ జాల వాని
మహితసౌందర్యలీలల మన్మథుండు, యక్షరాజాత్మజుండు జయంతుఁడందు. 10

ఉ. ఆతరుణావనీసురుఁ డొకప్పుడు వీథికి రా విలాసినీ
వ్రాతకఠోరధైర్యకుధరంబులు తుత్తుమురై చనం దయా
ర్ద్రేతరవృత్తి నేయునతఁ డింటికిఁ బోవ నిరస్తచాపుఁడై
చేతులు తీయఁగా మరుఁడు సెజ్జపయిం బడు భూవరోత్తమా. 11

ఉ. చక్కనివాఁడు నై మిగులఁ సన్నుతికెక్కిన యౌవనంబు నై
దిక్కులఁ బిక్కటిల్లుజగతీసురతేజము నై తలంప నే
యక్కఱ లేనికాఁపురము నైనధరాసురసూనుఁ డెంచఁగాఁ
జక్కెరపింటివాని సెకసక్కెము లాడఁడె భూవరాగ్రణీ. 12

ఉ. ఆరమణీయయౌవనవయఃపరిపాటి నతండు వైదికా
చారముఁ గట్టిపెట్టి బహుశాస్త్రపురాణపరిశ్రమంబు ని
స్సారముగాఁ దలంచి విటచర్యకుఁ జిత్తముఁ జేర్చె దుష్క్రియా
ఘోరత కిట్టివార లెడసొచ్చుటఁ గంటిమొ వింటిమో నృపా. 13

క. రాజా యేమని చెప్పుదు, నాజగతీసురుని మొదలియణువమను ధా
త్రీజనులు రోయునప్పటి, యోజన కాశ్చర్యమయ్యె నొకపర్వత మై. 14

చ. ధరణిసురాత్మజుండు గుణధన్యుఁడు వీఁ డని పెద్ద లెన్న నా
దరణముతో నుతింప సముదంచితకీర్తిసమృద్ధి నంత శే
ఖరమగు పెల్ల నంత ఘనకల్మషవృత్తికిఁ దెచ్చెఁ జూడుమా
పురుషులభాగ్యముల్ జిగురుఁబోణులచిత్తము నెట్లుమాఱునో. 15

సీ. వదులునీర్కావిదోవతులు గట్టుట మాని, వలిపెంపుఁజల్వదోవతులు మురిగె
వళముగా గోపిచందనము పెట్టుట మాని, తిరుమణి కొనగోర దిద్దఁ జొచ్చె
గడితంపుమేలుపచ్చడము గప్పుట మాని, దుప్పట్లు సైకాలుఁ గప్పఁ దొడఁగెఁ
బ్రతివారపంచాంగపఠన సేయుట మాని, కొక్కోకశాస్త్రంబు గొణఁగఁ దివిరె
గీ. బ్రహ్మకులవర్యసాహచర్యంబు మాని, చేరి కాముకసంసర్గ సేయఁ బూనె
సమిధలకు నేడకేడకేఁ జనుట మాని, తొడఁగె నేప్రొద్దు లంజమందులకుఁ దిరుగ. 16

సీ. అటువంటివాఁడు గాఁ డతఁ డంచుఁ బరు లెంచ, నెఱుఁగరాకుండఁగఁ దిరిగితిరిగి
వినఁగలఁ డీమాట యనుచు సందేహింపఁ, గడల సంశయముగా నడచినడచి
కాఁబోలు నని విన్నకన్నవా రెన్న నేర్పునఁ గని యానలు వోయివోయి
తప్ప దాతఁడు విటధర్మంబువాఁ డనఁ, జతురకాముకవృత్తి జరపిజరపి
గీ. చలి విడిచినాఁడు నాఁటికి జగ మెఱుంగ, నతఁడు మెలఁగంగఁ దొడఁగె నౌరా యనంగ
శాస్త్రిపారీణతాసముజ్జ్వలభుజంగ, తత్త్వ మితనికి ఘంటాపథం బనంగ. 17

చ. పరువడి మిత్రసంతతికిఁ బంచశరోపనిషద్రహస్యముల్
నిరతముఁ జెప్పుచుండుఁ గమనీయతరస్వరమాధురిన్ సవి
స్తరసురతాగమైకపథచారి యనన్ విటుఁ డయ్యె మేలుగా
ధరణిసురాత్మజుండు నిజధర్మముఁ దప్పఁ దొకింతయేనియున్. 18

ఉ. చూపులు వారకామిలఁ జొక్కపుగుబ్బలపై దువాళపుం
గోపులు సూప రూపమునఁ గోయిలమూఁకలఁ బచ్చవిల్లుఁబూఁ
దూపులు దాఁచి దేహలతతో విహరించెడుమారుఁడో యనన్
మాపులు గాఁగ భూసురకుమారుఁడు నిచ్చలు వచ్చు వేశ్యకిన్. 19

సీ. చల్లని మామీఁదఁ జలువఁబట్టినదట్టి, సలిపంపుదుప్పటి దానిమీఁద
మొల జముదాళి చాయలపిడియంబు చేఁ, బడగసూరియుఁ జిల్లబటువు చేతఁ
దనువున మంచిగంధము దానిపై గంధపొడి యందుమీఁద కప్పురపురజము
వలకారి సిగతాయెతులు దానిపై జాజివిరు లందుపై నొంటిపేరరుమాలు
గీ. మీఱు ఘనసారతాంబూలసౌరభప్ర, వాహవహగంధవాహప్రరోహమోహ
వశవిశాలేక్షణాజనస్వాంతుఁ డగుచు, రాత్రులఁ జరించుచుండు నా బ్రాహ్మణుండు.

సీ. జాతినపెండ్రుకల్ సవరించికట్టిన, పసిఁడివ్రాఁతరుమాలు దుసికిలంగ
నిదురచాలమి మాంద్యమొదవఁ జూచెడుకన్ను, లరవిరికెందమ్మివిరులు దాల్ప
వాఁడుఁ జూపినలేఁతవాతెఱ పలుదాఁకి, జిలుఁగుపెండలఁ జిమచిమయనంగి
వలిపెదుప్పటి పల్లెవాటు జాఱి యొయారి, చిటులుగంధపుఁబూఁత చెలువమమర

గీ. మారశాస్త్రాధికారదుర్వారవార, వారిజాస్యాతిసారస్యవచనరచన
కృతపరీరంభసంభోగకేళిఁ దేలి, పిదప కేతెంచు తొలిపటి వేళ నతఁడు. 21

ఉ. చూపరవుట్టుం బ్రమితశోభితమా క్తికప ద్మరాగముల్
దాపునఁ జేసినట్టి జిగిపంతపు మిద్దియలందు నత్తువి
ద్యాపటిమంబు సూపు వెలయాండ్రును దాను వినోదలీలఁ బా
రా పది వచ్చి యిత్తిగ దుగా యని పన్నిన ముగ్గడించుమన్. 22

సీ. కోనమచందురువంటి నుదుటఁ గస్తురినామ, మొఱపు మించఁగ దిద్దు నొక్కరితుకఁ
జిమ్మచీఁకటి గ్రమ్ము క్రొమ్ముడి గొజ్జంగ, లొనరఁగాఁ దుఱుము వేఁ ఱొక్కరితుక
జక్కవకవవంటి చన్నుల హారంబు, లొయ్యఁగా దిద్దు నొం డొక్కరితుక
మించుఁదీఁగెను మించుమేనఁ గప్పురగంధఁ, మొప్పుగా నలఁదు మఱొక్కరితుక
గీ. నొకతె చెక్కులపై మకరికలు వ్రాయు
నొక్కతెను మెల్ల జడ తీఁగ చిక్కుఁదీయు
నొక్కపని యెప్పుడును గల్గియుండుఁ గార్య
భరము లే దనఁగూడ దాబ్రాహ్మణునకు. 23

క. వారాహము వారణగిరి, వారాన్నిధి వారణాశి వారణవరదుఁ
వారాంగనాజనస్మృతి, దారూఢి స్మరుడఁ డాతఁ డనఘుఁడు వోలెన్. 24

సీ. నిగమశాస్త్రంబులు నేర్పినగురువుఁగ, న్గొన నెన్నఁడును లేని కోప మెత్తుఁ
దీర్థయాత్రాపరాధీనులఁ గనుఁగొన్న, మది నెన్నఁడును లేని మంట పుట్టు
వైదికాచారప్రవర్తిష్ణు వీక్షింప, నిల నెన్నఁడును లేని యేవ గలుగు
శమదమాధికుఁ జైనసన్యాసిఁ గనుఁగొన్న, మును పెన్నఁడును లేనికనరు దోఁచు
గీ. సంధ్య యన్న శిరోవ్యథ సంభవించు, భస్మధారణ మన్నఁ దీవరము వొడము
దేవపూజావిధానంబుఁ దీర్చు మన్న, నేత్రములు దయించు నాబ్రాహ్మణబ్రువునకు. 25

సీ. తలిదండ్రులకు సమ్మతంబుగా నతిథిస, త్క్రియ యటంచు నొకింత గిలుబుఁ జేయఁ
బొరుగూళ్లఁ గలమాన్యభూముల ధాన్యంబుఁ, గ్రియవెట్టి విడుచుఁ బరిస్పరంబుఁ
దనపైఁ బరామర్శ దప్పియుండదు కొంతంగి, దొడ్డసామ్మెమైన దొంగిలించు
నప్పుచెల్లింద్రపై నాదరంబులు సూపి, యరిణముల్ గొనిపోయి యపహరించు
గీ. బలపమును గత్తియును బూని ప్రజలయిండ్లఁ, గన్నవెట్టని దొక్కటే కాని కొదవ
కడమదుర్వృత్తు లన్నియుఁ గలచె నతఁడు, లంజతల్లులచేతివుల్లటుకుఁగాఁగ. 26

వ. మఱియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము 27

గీ. అఖిలవారాంగనామనోహారివిహారి, నెరతుఁ డొనైన నందులో నిరుపమాన
గానపరిణతచంపకగంధి యనెడు, వాలుఁగంటికి మిక్కిలి మేలువాఁడు. 28

క. మగఁడేల చంద్రుఁ డేటికి, మరుదంతర మేమిపనికి మనుజేశ్వర యా
తరుణి కపగంటఁ గాదే, పురుషులధైర్యంబు లేదు పో మ్మనిపింపన్. 29

చ. అమృతరసంబు లుట్టిపడ నాలతిఁజేసినవీణఁగోపలన్
దుమదుమగా వచోమహిమ దోఁపఁగ గీతముఁ బాడుచున్న న
క్కమలదళాయతేక్షణ నఖంబులఁ గిన్నర మ్రోయఁ జేసినన్
దమకము పుట్టనుండ జనతాహృనయంబులు ఊతఁ జేసెనే. 30

చ. పలుకక యుండె నేని శితపంకజలోచన యాదరంబు పైఁ
జిలుకక యుండె నేని విటశేఖరులన్ గరుణావిదూరుఁడై
యలుగులపాలు సేయు విషమాస్త్రుఁడు త త్తరుణీలలామ లో
నలఁగుట కాదు ప్రాణముల కల్గుట దేహవిసర్జనార్థమై. 31

క. అది గనుక దివిజవేశ్యల, సదనంబుల నున్నమానిసంతతితలఁపుల్
గుదిగుంపులు చేసి మథిం, పదె యవకాశంబు గలుగ స్వర్గమునందున్. 32

సీ. వాలుఁగన్నులచేత వలలఁ బెట్టుటె కాక, యభ్యసించిన దొక్కయదటుఁ జూపు
ముఖచంద్రరుచులచే ముల్లుపెట్టుటె కాక, సంతరించిన దొక్క వింతనవ్వు
బటువుగుబ్బలచేత భ్రమలఁ బెట్టుటె కాక, సంఘటించిన దొక్క జాఱుఁ బైట
వెలిద్రొక్కు సిగ్గుచే వెతలఁ బెట్టుటె కాక, యలవరించిన దొక్క కులుకుఁ బలుకు
గీ. గాఢయౌవనమున గాసిపెట్టుటె కాక, నేర్చుకొన్న దొక్క నెఱతనంబు
తరుణివిభ్రమంబుఁ దలపోయ శక్యమే, ధాత కైన వానితాత కైన. 33

సీ. సాహిత్యమార్గంబు చౌకఁ జేసిననాఁడు, సంగీతమునఁ బ్రీతి సల్ప నేర్చు
సంగీతవైఖరి సమ్మతింపనివేళ, నింపుగా వీణవాయింప నేర్చు
వీణావిరావంబు వెగటువోఁదినయప్డు, సొగటాలవేడుక చూప నేర్చు
సొకటాలపైఁ గోర్కె సుడకు వచ్చినయంత, వింతమాటల గారవింప నేర్చుఁ
గీ. జదువఁ బాడంగ నింతంత చతుర గాదు, వీణవాయింప నింతంత జాణ గాదు
జూద మాడంగ నింతంత జూటగాదు, ప్రతిభ పల్కంగ నింతంత ప్రౌఢ గాదు. 34

చ. తగవరి మాటకారి నయధన్యపదార్థముపట్ల మిక్కిలిన్
దెగువరి కంతుకేళిఁ గడిదేఱినజాణ రసజ్ఞకోటిచేఁ
బొగిడితఁగాంచినట్టిగుణభూషణ ముద్దులగుమ్మ దానికిం
దగనిది చేసె నాసలుప దారుణనిస్స్వజనుల్లె తల్లిగన్. 35

గీ. ఆపణిమణి కాంచి యరుగుదెంచు, విటుల వర్ధించు కాంతు నవ్వేళఁ దిమాత
వరనిధానగ్రహార్థులై వచ్చువారి, దుస్సహాటోపమున మొత్తు దుర్గవోలె. 36

క. తుదినుండి మొదటివనుకం, గొదవతె పచరించు సాధుగుణ మించుక లే
వది చెఱచినకాఁపురములు, పదిలక్షలు గలవు సొమ్ముపైఁ గోరికచేన్. 37

క. లక్షయు నిచ్చిన నది నిర, పేక్షత విహరింప నర్థ మిమ్మనక దయా
దాక్షిణ్యంబులు శూన్యము, రాక్షసి పుట్టినది విటులపాలిటములు గొనన్. 38

క. ఆకంబుకంతెఁ జూచినఁ, నేకోలఁదులవారి కైన నించుక మోహో
ద్రేకంబు వుట్టు టరుదా, భీకరవర్తనులసుఖము పెపితలఁ బట్టున్. 39

ఉ. కాంచనభూషణాంబరనికాయము నిచ్చలు నిచ్చి యైన మె
ప్పించుకొనంగలేఁ డలకుబేరతనూభవుఁ డైన నెల్లి చె
ల్లించెద నన్నఁ బోవిడదు లేఖకులాధిపసూను నైన న
త్యంచితశక్తి సేపగిది దాని జయింతురు కోడెకాండ్రు గ్రోలిగిన్. 40

సీ. నిర్మిత్రదారిద్ర్యనిరుపాధియుతసిద్ధ, సంజాతహృన్నఖల్లి లంజతెల్లి
కామితార్థవితీర్ణికర్ణాయమానప్రల్లవలోకపటుఝల్లి లంజతల్లి
నిజశాసనోల్లంఘనజిఘృతుకామిలో, లకురంగచయభిల్లి లంజతల్లి
శాంబరీచంగభుజంగకృత్యవివేక, పుంజభూరుహవల్లి లంజతల్లి

గీ. బహువిధోపాయచణపంచభద్రభద్ర, కుంజరమ్మగాధిపమతల్లి లంజతల్లి
నిఖిలవిటజనారంభముల్ నేలఁ గలప, వంజ కురువెంచుపెనువెల్లి లంజతెల్లి. 41

సీ. పిడుగుచందమ్మునఁ బడి మోదుతెరువాటు, కాని కైన నొకింత కరుణ పుట్టు
బహుధనాపేక్షచే బాధించునృపతి కైన, ను జనించు నొకింత కనికరంబు
చేరి కన్నడభూమిఁ జెఱపట్టుపాశ్చాత్య, నృపతి కైన నొకింత కృప దలిర్చు
నతిపాతకుల నొంచుయమకింకరుల కైనఁ, గంపించు నొకింత కారుణికత

గీ. యసమసాయకసమరకర్మాంతరాయ, కరణపారీణవాక్క్రియాగౌరవమున
నఖిలవిటకోటిధన మెల్ల నపహరించు, లంజతెల్లికి దయలేదు లక్ష యైన. 42

సీ. కాలకూటమునందుఁ గలమేలువిస మెల్ల, రాలలోఁ గల్గుకార్కశ్య మెల్లఁ
బైశాచసమితిలోపలివికారం బెల్లఁ, గపికోటిలోనుండుకాంక్ష లెల్ల
సెలయేళ్లలోన వర్తిలెడువక్రత లెల్ల, మయరంబరులలోనిమాయ లెల్ల
ధార్తరాష్ట్రులలోనఁ దనరుమచ్చర మెల్లఁ, బంచపాతకులలోఁ బాప మెల్లఁ

గీ. దీసి విటదోషరాశిచే ద్విగుణిఁ జేసి, యనృతపంకంబులోఁ గల్పి యశుచిభావ
రసముఁ జిల్కించి నిర్మించె బ్రహ్మకృపణ, తరుణహృచ్ఛల్లి యగులంజతెల్లి గాఁగ.43

గీ. వేము పండిన కున్న విషసమావిష్టంబు, పండె నేని మధురఫలయుతంబు
పండ్లు రాలునపుడు పణ్యాస్త్రీ విషంబు, వేశ్యమాత విషము వేమువిషము. 44

గీ. లంజకల్లులరీతి యీలాగు వింటె, తలఁప నది లంజతల్లిమాత్రంబ కాదు
కపటతరవృత్తి ప్రత్యక్షకాలకూట, మాజరఘికూఁతుఁ దగిలినాఁ డాఘనుండు.
సీ. ఒరఘాయె జిలుఁగుసన్నరుమాలు సొబగంచు, వివరింప నిదె పట్టురవిక కనును
జెలువాయెఁ గ్రొత్తసందులవస్త్ర మని యెంచి, కొన నిదే పయ్యంటకోస మనును
జెలువాయెఁ నునుఁజెంపసిగపట్టుబొం దంచుఁ, దలపింప నిదె జడత్రాటి కనును
బాగాయెఁ గుసుమపూఁబసిమిదుప్పటియంచుఁ, గనుఁగొన్న నిదె కొమ్ముకాసె కనును
గీ. వజ్రవైడూర్యవరనీలవనజరాగ, వారమది వాని కెంత తత్సార మంతె
ప్రాణ మైన నొసంగు నేపాటి యైన, నడగనిదె పాప మాధవశాయతాక్షి. 46
క. ఈరీతి నతఁడు దుర్వ్యయ, పారంబున సంచరింప బహువత్సరముల్
ధీరమతిఁ జూచి చూచి య, వారితదుఃఖాప్రసన్నవదనాంబుజయై. 47
వ. ఒక్కనాఁడు త్రిభువనాశ్చర్యకరసౌందర్య యగునతనిభార్య కరుణాయత్తయగు
నత్తమ్ముంచఱ నిలిచి వాసరారంభసముజ్జృంభమాణ శతపత్రపత్రజైత్రంబు లగు నేత్రం
బుల నశ్రువులు గ్రమ్మ కరుణంబుగా ని ట్లనియె. 48
ఉ. అత్తవు సర్వలక్షణసమగ్రగుణాఢ్యవు నన్నుఁ దిట్టుచున్
మొత్తనె కాని నీకొడుకుమూఢత మానుప వేల వాఁడు రో
తొత్తులమారి యై గృహము ద్రొక్కక యొక్కకదానిఁ బూనికన్
గుత్తకు నంచు నుంచుకొని కోకలు నూకలు జోక నీయఁగన్. 49
ఉ. చిత్తములోనఁ బ్రేమ విలసిల్లఁ దనూభవులన్ సమస్తలో
కోత్తరరత్నభూషణసముజ్జ్వలితాంగులఁ జేసి వారియ
త్యుత్తమధర్మవృత్తిఁ బరితోషముఁ గాంతురు గాక యిట్టిదు
ర్వృత్తిఁ జరింపగాఁ బరిభవింపక చూతురె మీవిధంబునన్. 50
ఉ. కోరికి దీరఁగాఁ గుడిచి కుంకుమసంకుమదాంకగంధ మొ
య్యారముగా నలందుకొని యాకులుఁ బోఁకలుఁ జాలునట్లు ను
ర్వ్యారతరేచ్ఛఁ బుచ్చుకొని వారలతాంగులయిండ్ల కేగఁగా
నూరక చూచుచుండెద రయో యుపలింపక మీరు మామయున్. 51
సీ. మామగా రైననుఁ గామాంధవర్తనం, బోజ గాదని పల్క నుడుగ కున్నె
వదినె యైనను వారవనితాప్రసంగంబు, లర్హమా యని పల్క నణఁగ కున్నె
బంధువు లైనను బథముఁ దప్పి చరింప, మేసీతి యని పల్క మాన కున్నె
మీ రైన నీదురాచారపారీణత, వలదురా యని పల్క వదల కున్నె
గీ. కట్టుకట్టా చూఱ విడిచి యీకరణి ధరణి, సురకులాచారధర్మంబు చూఱపుచ్చు
సుతునిదుశ్చేష్ట లూరక చూచుచున్నఁ, బరువునకు లోటుతో నగుబాటు రాదొ.

క. మీకతనఁ గాదె యీయువి, వేకం బాయనకు నుప్పవిల్లుటు మీయా
త్మీకరణ మింత యడిగినఁ, జేకొనునే యాతఁ డింత శిష్టేతరతన్. 53

క. మీకెఱుఁగరాదె తనయుని, పైకరుణఁ దలంపఁడో యపారశ్రీచే
గైకొనరో కాక దినముఁ, గోకలు మొదలైన వెన్ని గొంపోఁ డింటన్. 54

గీ. అన్నియును జూచుచుంటివి నంతొ యింతొ
యంతచనుమానమునకు రా వింతెకాని
నేనె పట్టిన నన్నుచో నానె ధనము
డులిచినప్పుడు తెలియు నాసులువులెల్ల. 55

క. నాకేమి దేహసుఖము పు, రాకృతమే కాక నేఁడు రాఁబోనే యీ
లోకమున నేనె యనుదా, మాకోడలు గావొ పొరయకుంచము గానో. 56

క. ఆలోఁగని చేతోధృతి, చేలింపక మిమ్ముఁ గూడి చెప్పితి నదియున్
జాలింపక కైశికజిత, రోలంబకదంబ యేనరుంధతిఁ గానన్. 57

తే. ఇంతనాఁడు కరగ్రహవంతురాలిఁ, జేసి తోడ్కొని వచ్చితి చెప్పినట్లు
చేయుచుంటిని గోత్రంబు మీయనుజ్ఞ, నలువు నా కేయెడల నైనఁ దెలుపఁగలరె. 58

క. ఒకతెవలె నాడి యాడిం, చుకొనుట నేయినను పొరుగు చూచెనొకో యు
ప్పుకుఁజప్పుకుగా ననుఁ జూ, చుక నడువఁగ వలెఁ గులీనకుకసల్లాపల్. 59

క. నను నేనె పొగడికొనఁగాఁ, జన దింతియకాని మగఁడు సంసారనివ
ర్తనఁ జేసి యిట్లు తిరిగిన, మనమునఁ గోపింప కెట్టిమగనా యుండున్. 60

వ. అని యనేకప్రకారంబుల విలపించి. 61

క. కలకంఠకంఠి మదిలో, పలిదుఃఖం బాపలేక బాష్పజలంబుల్
జలజలజల ప్రవహింపఁగ, వలవల నత్తెస నమ్రసక్త్రాంబుజయై. 62

వ. జనమనోరంజనఖంజనపరాంజనమిళద్బాష్పధారాప్రకల్పితానల్పసారంగమదపత్రభంగ హృదయంగమకపోలంబు గా నేడ్చుచున్న నవ్వఘూరత్నంబుం గాంచి సముచిత చేలాంచలంబునఁ గన్నీరు దుడిచి సముదాత్తకృపాయత్తచిత్త యైనయత్త యి ట్లనియె. 63

క. ఓయమ్మ యేల యేడ్చెద, వో యుజ్జ్వలబాష్పధార లుట్టిపడన్ శో
కాయత్తచిత్తనీరజ,నై యెఱుఁగుదు నీమనోవ్యథాగతి తల్లీ. 64

తే. ఏమిసేయుదు మదిలోన నెన్నఁడైన,నుఱిచియుండెదుదానా మగని వాని
కర్మకౌశల మెట్లు కాఁగలదొ కాని,యాణిముత్యము వసిపోగు నయ్యె,నేఁడు. 65

క. ఓనాతి వారకాంతా, ధీనగుణాతురుని మగుడఁ ద్రిప్ప నవశ్యం
బైనం గానిమ్ము సమ, స్తానునయాలాపసరణి నాతని దేర్తున్. 66

ప. అనియూఱడించి పలుకుచున్నంత. 67

ఉ. సంగతి నిష్ఠ నేతపము సల్పఁగ నెన్నటి కబ్బెనో నుతిం
చంగలదేవతాపదవి సాధునమస్కరణీయభావమున్
భంగురమైనయాతపము వాయఁ ద్రయీమయుఁ డయ్యెయో దివా
సంగమజాతపాతకము చాలక వారుణి కేగె భూవరా. 68

మ. అపు డంభోజహితుండు కృష్ణుఁ డనఁగా నాకాశపుంజీనుబం
డపయిన్ వేడుక నెక్కి జాఱుకొనుచుండన్ సాంధ్యరాగంపుహే
మపుఁజేలా దిగఁజాఱ వక్త్రములనం బైఁ జాటుగా నంధకా
రపు నీలాంబరముల్ ధరించిరి సమగ్రప్రీడ దిగ్గోపికల్. 69

చ. భిమరిదిశాయశోద దివిషేరిటికృష్ణుని కుగ్గువెట్టుచో
నుదరములో జగంబుల సమున్నతిఁ గాంచి పరిభ్రమించి చే
నవలిన జాజి బోరగిల వ్రాలినమేలిమిగిన్నె బోలె సా
ముదముఁ జెంది యున్నశశి యొల్కినపాలును బోలె వెన్నెలల్. 70

తే. జారచోరప్రవర్తన జరగ దయ్యె, మండలస్ఫూర్తి దిశ లెల్ల నిండుకొనియెఁ
గానరా దయ్యెఁ బ్రతిపక్షగౌరవంబు, రాజధర్మంబు తత్ప్రకారంబ కాదె. 71

సీ. గగనసిద్ధుఁడు భస్మకక్షపాలిక గ్రమ్మరింప వెల్వఁడుభస్మరేణు వనఁగ
రాజు విభావరీరమణిపైఁ గెరనాడి, కల్లజిమ్మినతుషారజల మనంగ
యామినీవణిగంబుజాస్య దిగ్భిత్తులఁ, జల్లిన ఘనమార్ణసలిల మనఁగ
కమనీయసితపక్షఘనసారతరునిశా,త్వగ్గాత్రికర్పూరవార మనఁగఁ
గీ. గాసె నమృతాశనాశనకాశకేశ, కాశలోకేశవేల్లితకేశపాశ
కాశదేశబిశేశయాధీశసుప్ర, కాశసంకాశకౌముది యాశలందు. 72

వ. ఆసమయంబున. 73

సీ. తుదిగోళ్లు నున్నఁగా దువ్వి కీలించిన, సిగ జాజివిరులు వాసిగ ధరించి
కమనీయనాసపైఁ గస్తూరినామంబు, దీరుగాఁ గొనగోర గీఱి దిద్ది
చలువ దీర్చినపన్నవలిపెదోవతిమీఁద, నపరంజిమొలత్రాడు హవణుపఱచి
జంగాళముగ మేన జాలువాబంగారు, వ్రాఁతచందురుకావి వలువ గప్పి
గీ. కలితకర్పూరకాశ్మీరగంధసాంద్ర, ఘుమఘుమామోదవిభవంబు గుబ్బతిలఁగ
గొడుగు పావాలుదొడిగిమక్కువఁ జరించు, విప్రతనయుండు వెలయాండ్రవీథులందు.

మ. ఒకలీలావతిఁ గౌఁగిలించి యవురా యోరీ యటన్నన్ గికా
గికగా నవ్వెను హార మేడది లతాంగీ యంచు వక్షోజపా
ళికపై వ్రాయు నఖాంక మొక్కటెనుఁ గేళిన్ జాళికం బుప్పచూ
లికఁ జుట్టంజనుఁ గానకుండ నొకప్రాలేయాంశుబింబాస్యకున్. 75

మ. శుకవాణీ యొకయేకతం బనుచుఁ దత్క్షేత్రంబులో పంచసా
యకమంత్రంబు సముచ్చరింప నిటు తా లక్షించుచున్ సముద్దీపిత
భ్రుకుటీకంబుగ బొమ్మ వట్టి తొలఁగం ద్రోయంగ నాయంగనల్
సకులున్ నవ్విరి మోసపోయి తని హాసవ్యాస మేపారఁగన్. 76

క. ఈరీతి దర్శివారవి, హారంబున నర్ధరాత్ర మగుదాఁకఁ బ్రమో
దారూఢిఁ దిరిగి నిజవేశ్యారత్నముకడకు నిదుర కరిగెడుబుద్ధిన్. 77

ఉ. రాజముఖీపయోధరవిరాజితకుంకుమగంధలేపవి
భ్రాజిత మైనదేహముఁ బ్రభాసురకాంచనచిత్రితాంచల
భ్రాజితశాటిఁ గప్పుకొని పాదము లల్లన నేల మోపుచున్
భోజన మాచరించుటకు భూసురసూనుఁడు వచ్చె నింటికిన్. 78

వ. అప్పుడు. 79

క. తడవాయె నేమి సేయుదు, నెడవాయనిసఖులతోడ నెం దున్నాఁడో
కొడుకు కాఁకలిఁ గొనె నంచున్, మిడుకుపయోపేత మాత మృదువాగ్జాతన్. 80

తే. చేరఁ జనుదెంచి పరమలజ్జితుఁడు పోలె
నమ్రవదనాబ్జుఁ డై యున్ననందనునకు
నన్నపానాదు లొసఁగి నెయ్యమున నొక్క
యున్నమితపీఠమందుఁ గూర్చుండఁ జేసి 81

క. సుతు వైదికధర్మసము, న్నతుఁ జేయం గోరి చేరి నిపుణతఁ బలికెన్
శతధృతిసతిగతి నతియుత, మతి యయినతదీయజాని మనుజాధీశా. 82

సీ. వృద్ధానుసారంబు విడిచి కొంచెపుఁగాని, నీతులు గైకొంటివే తనూజ
బ్రాహ్మణ్యవిభవంబు గా దంచు జూదంపుఁ,గాసుల కాశించితే సుతుండ
విప్రధర్మం బెల్ల పీటిబుచ్చి విరాళి,పోకలఁ బోనేర్చితే కుమార
కులము గోదావరిఁ గలపి వేశ్యాసంగ, మాసచే గావించితే సుపుత్ర
గీ. వేదశాస్త్రప్రసంగంబు వీడుకొల్పి, పడుచుఁగూఁతలు గూయఁ బాల్పడితె తనయ
యింట నెన్నఁడు లేనియీహీనవిద్య, యెన్నఁ డభ్యాసమాయెరా కన్నతండ్రి. 83

శా. లేరా భోగపరాయణుల్ జగతిలో లీలావినోదంబుగాఁ
బోరా వేశ్యలయిండ్లకున్ వివిధసంభోగార్థులై గుట్టుతో
రారా వైదికధర్మమార్గపథిక ప్రావీణ్యముం జూపరా
యేరా తండ్రి పరిత్యజింతు రఁటరా యారీతి సత్కర్మముల్. 84

క. కొదలం బొందనిబహుసం, పదలన్ నీతోడివారు బ్రతుకఁగ నయ్యో
మదనాతురుండ వైతివి, చదివినదోషంబొ కాక జన్మఫలంబో. 85

క. నందను నిన్నుఁ గనుంగొను, నందనుకను నెదురు సూచు నకట సముద్రం
బిందునకుఁ బోలె జనకుం, డిందునకా నీమహత్త్వ మేమన నేర్తున్. 86

చ. కొడుకులు సర్వవిద్యల నకుంఠితు లై సభలందు శాస్త్రముల్
దడయ కుపన్యసించి వసుధాతలనాథులచేత గుఱ్ఱముల్
గొడుగులు గాంచి సత్యగుణకోవిదు లై విహరింప సంపదన్
బొడ వగునట్టిగేహినులె పుణ్యశరీరలు గా కుమారకా. 87

క. ధారిణి నేమి యను నెఱుఁగని, వారల కొకరీతిగా 'నపశ్యంపితురా
చారం' మని నీవె చదివి కు, మారా జనకానుచరణ మఱవం దగునే. 88

క. చక్కనిది కాదొ మది పెం, పెక్కినయది కాదొ కులసమీహిత కాదో
యక్కట యిన్నిగుణంబులఁ, జొక్కట మగుసతిని విడువఁ జాతురె తండ్రీ. 89

క. రతి గద యాకృతి మతి భా, రతి గద హైమవతి గద నిరంతరసముసం
భృతి పతియందు రతి నరుం, ధతి గద యిన్నియును గలవు తావకసతికిన్. 90

వ. అని పలికి నిజవచనరచనాంగీకారహృదయుండునుం బోలె నవ్వారాంగనాధ్యానపరాధీనమానసుం డై ప్రత్యుత్తరం బీక యున్నకుమారు నున్నతాకారు వేమాఱు గారవించుచు సముంచితకాంచనచిత్రితాంచలంబు లగుచేలంబులు గట్టుకొన నిచ్చి యామంధరగంధబంధురసౌగంధికధురంధరచికురబంధురుం జేసి గంధంబు పూసి పథాగ్రహంబునకుం దోడ్కొని పోయి యిట్లనియె. 91

క. ఇది మొదలు వారకాంతా, సదనవ్యాపారచింతఁ జాలించి సన
మ్మదగతి సంసారస్థితి, వదలక చరియింపవయ్య వైదికమణి వై. 92

గీ. అనుచు జనయిత్రి నీతివాక్యప్రసన్న
హృదయుఁ జేసితి సుతు నందు నరిగె నతఁడు
ప్రొద్దు వోయిన దని తలారులకు వెఱచి
యొకవిధంబున నారాత్రి యుండఁ దలఁచె. 93

వ. అంత. 94

మ. జలకం బాడి మణుంగు గట్టి వరభూషాసంఘముల్ దాల్చి చెం
గలువల్ కొప్పునఁ గీలుకొల్పి రతికాంతుం జేర నేతెంచెఁ ద
త్కులకాంతామణి వారసారసముఖీదుర్వారమారావహ
త్కలితాఘూర్ణితమానసుం డయి కడుం దాపించుప్రాణేశ్వరున్. 95

క. చనుదెంచి యతనిమోమునఁ, గనికర మొకకొంత యయినఁ గానక యపు ప
వ్వనజాతనయన సాధ్వస, మును సిగ్గును మానుషంబు ముప్పిరిగొనఁగన్. 96

మ. అలివేణీమణి సిగ్గుచేత నతవక్త్రాంభోజ యై యుండుచే
తుల తాంబూల మొసంగఁగాఁ బోయినఁ గృపామారీకృతుం డై ఘన
జ్వలనజ్వాలికరాళ మైనయొక విశ్వాసంబుఁ గావించి య
వ్వలిమోమయ్యె రచింతురె కులసతుల్ వారాంగనాభోక్తకున్. 97

సీ. లేమ వో గృహిణిపై మోహంబు లోకాపవాదంబునకు నైన వణఁకవలదె
కామినీ సంసారకాంక్ష మేలికి దాని, వినయసంభృతి కైన వెఱవవలదె
యామయో పయ్య మాయిషకంభకుచపొందు, జననియానతి కైన జడియవలదె
రాముఁడో మనసు వారవధూవిలగ్న మై, కులకాంత యని యైనఁ గొంకవలదె

తే. కారుణికభావమాత్ర మిమాఁదనక్కి, వారహృదయాబ్జుఁ డై యాపయోరుహాక్షి
పిడె మీయంగఁ బోయిన వినరముద్ర, నవలిమోమయ్యె నతని నేమనఁగవచ్చు. 98

క. తమకంబు లేక కాయ,ం్యయుఁ జూప కతఁడు కులాంగనాపరివీక్షా
విముఖత్వ మిట్లు చూపిన, గుమగుమమని శోకవహ్ని గుబ్బతిలంగన్. 99

మ. అకటా యింతకుఁ దెచ్చెనే యనుచు నత్యాపన్న యై జాలవ
ల్లికలో పిడియ ముంచి పంచశరకేళీవాంఛ చాలించి చం
పకగంధిన్ వనలోన మెచ్చుకొనుచుం బద్మాసనుం దిట్టుచున్
వికలం బైనమనంబుతో నిలుచెఁ జెంచెం బత్నిమాపస్థలిన్. 100

మ. తెలపం దల్లడమందుఁ దాల్మి వదలుం దాపించుఁ గోపించుఁ ని
తులు వల్లించిన తల్లిమీఁద విధికిం దుర్వారు లెవ్వారనున్
వలయూఁచుం దనబుద్ధిహీనతకు సాధ్వీశ్రుసుధం దప్పు డా
వెలయాలిన్ వలయాలిమత్కృపయుగన్ వీక్షింపఁగాలేమికిన్. 101

క. వాఁ డాసాంతయొగడియలు, నేఁడాదిగఁ గడపి సూర్యుఁ డిఁకఁ దూర్పునకున్
రాఁడో యని తలఁపోయఁగ, మూఁడవజాము య్యె నంత మోద మెలర్పన్. 102

శా. పాయం జొచ్చె విలాసినీసురతసౌభాగ్యంబుచేఁ దారకల్
మేయం జొచ్చెఁ జకోరపంక్తులుగడుం బ్రేమన్ శరచ్చంద్రికల్
మాయం జొచ్చె మరుండు తేఁజినుడునత్తున్ జంక నింకింపుచున్
గ్రాయం జొచ్చెఁ బ్రతీయయామక్ష్మకవానల్ కొక్కొరొకోధ్వనిన్. 103

చ. వనరుహబాంధవుండు వగవాఁడెసదేఁగలఁ డింకఁ బోదమా
యనముఁ గన్నరాఘువవాక్యము లొక్కచకోరమాత్రితో
విని తమిదీఱ వెక్కసము వెన్నెలముద్ద భుజింపఁ బోయి గొం
తునఁ బడవేసికొన్నహిమతోయ మొసంగిరి నెయ్యు లయ్యెడన్. 104

ఉ. అప్పుడు విప్రసూనుఁడు రయంబునఁ బానుపు డిగ్గి వేడ్కతోఁ
జెప్పకు మింక నొక్కదరిఁ జేరెద నంచుఁ దలంచువేళ లా
గొప్పఁగ ధౌతచేలము సమున్నతలీల ముసుంగువెట్టి నీ
ర్గప్పినవిస్ఫుటచందమున రాజనిభానన నిద్రవోవఁగన్. 105

శా. ఔరా దైవము దెచ్చిపెట్టె ననుచున్ సామోదచిత్తాబ్జుఁడై
చేరంబోయి ముసుంగుఁదీసి కడువైచిత్ర్యంబు మీఱన్ దురా
చారాగ్రేసరుఁ డాధరాసురుఁడు కాంతున్ నల్లపూసాదిగా
నారామామణిసొమ్ము నాఁచుకొని వేశ్యావాటి కేగె న్నృపా. 106

శా. నీడాంతంబులనుండి పక్షులు మెడల్ నిక్కించి పల్దిక్కులన్
జూపన్ దుమ్మెదగాణ పాడఁ దెలిమించుంగూడ నబ్జేక్షణల్
మేడన్ నిద్దురమంపువీడఁ గమనుల్ మీనాంకుతోఁ గూడఁ గ్రీ
డాలంబమ్ములు వీడనాడఁ దమితోడం దెల్లవాఱె న్నృపా. 107

క. తమి తీఱె రమణరమణుల, తమి తీఱెన్ సాంధ్యరాగధారాళరుచుల్
గమిగూడె రథాంగవిహం, గమి గూడెం బ్రాణనాథు గాఢప్రేమన్. 108

సీ. బటువుగా నాకాశపాంథచూడామణి, పెట్టినకుంకుమబొట్టనంగ
సమయపత్రిక సురేశ్వదిశావిపణిలం, జిత మైనలత్తుకబిళ్ల యనఁగ
నఖిలజగత్ప్రాణహరణకాంక్షఁ బురారి, కెంగేలఁ బట్టినకేడె మనఁగ
బహువిహంగమకులాస్పదవిష్ణుపదవట, ప్రథమదిక్శాఖాగ్రఫల మనంగ
గీ. వాసవాశాధరాధరవ్యాసమాని, వల్లభుఁడు 'నదైవం కేశవాత్పరం' బ
టంచు నెత్తినహస్తారుణాబ్జ మనఁగ, భానుఁ డుదయించె దేదీప్యమానుఁ డగుచు. 109

వ. ఇట్లు సూర్యోదయం బయ్యె నంతను మున్న యన్నామమాత్రబ్రాహ్మణకలాపకోకి
లాలాపమరాపస్వాపసమాపసమయసమాలోకితాశేషభూషావిశేషవర్జితప్రతీక యై
సొమ్ము వోవుటకు నొకింత చింత లేక యతనివివేకహీనతను దుఃఖించుచుండె నిట
నతండును బ్రకటితవిటుర్ఘాటుహాటకసంఘాటసముచ్చాటననిరాఘాటం బైనవేశ
వాటంబు చేరి యందుఁ బ్రకల్పితమోహం బగుచంపకగంధిగేహంబు చొరంబడి
పోవుసమయంబున. 100

ఉ. నిద్దుర మేలుకాంచి రమణీయతఁ బూర్ణసుధామరీచికిం
బెద్దఱికంబు దెచ్చుతన మెచ్చులమోము నిషేచనక్రియం
దిద్దియుఁ గారవించి ప్రమదంబున నద్దముఁ జూచి నామ్రముం
దిద్దుచు నున్నయున్నమితదీప్రసుచం గని చేరఁబోవఁగన్. 111

మత్త. మత్తకోకిలవాద విప్రకుమారమన్మథుతోడ నే
షోత్తరంబుగ నిల్లు పల్కె సముజ్జ్వలస్థితి నోరి నన్
జిత్తజాశుగపాళిపాలుగఁ జేసి యన్యవిలాసినిన్
దత్తరంబుగఁ బోయి కూడితి దాని కే మని పల్కఁగన్. 112

క. ఆమాట వివిధమాయా, స్తోమపుఁ బలుమాట గాఁగఁ జూడక వాఁడా
యామవ్వయప్రవర్తన, కోమలి కెఱిఁగించెఁ బూస గ్రుచ్చినరీతిన్. 113

వ. అదియును విశ్వసించినదయ్యుంబోలెఁ దదీయవచనంబు నాకర్ణించి నిరంతరసౌఖ్యాంబుధి
నతనిం దేల్చుచుఁ జిత్తంబుఁ దుల్చుచుఁ గొన్నిదినంబులు గడపి నంతట. 114

సీ. దేవాదులకు మ్రొక్కఁ దీఱ దాయె నటంచుఁ, జెల్లింపుచును దానితల్లి కొంత
యేరి కెద్దులు దూగ మే మింక నిడు మంచుఁ, దఱుకించి దానిసోదరుఁడు కొంత
యంగడి నేమేమొ యమ్ముచున్నా రంచు, గాండ్రలై దానిచెల్లెండ్రు కొంత
యన్నరో రాదాయె వన్నెచీర యటంచు, వావిఁ దెల్పుచు దానివదినె కొంత
గీ. యక్కతోడు సుమీ నాకు ముక్కఱైనఁ, జేసి తెప్పింపు మను దానిదాసి కొంత
మెల్లమెల్లనఁ జేతిసొమ్మెల్ల నిట్లు, గుల్లగుల్లంగఁ దిని తల్లడిల్లఁ జేయ. 115

సీ. అత్తవా రిచ్చినయపరంజిఘంటీలు, సంశయింపక వేగఁ జదువఁ బెట్టెఁ
దండ్రి చేయించినదర్భాంగుళీయకం, బావృత్తి గాఁగఁ దా నమ్ముకొనియె
మేనమామ ప్రియంబుతో నొసంగిన పైఁడి, మొలత్రాడుఁ బ్రాఁతయప్పులకుఁ గట్టె
జనని చేయించినజాళువాతాయెతుల్, బడ్డిలెక్కకుఁ జిందువందుఁ జేసెఁ
గీ. దులసిపోఁగులు మొదలుగాఁ గలుఁగు వెట్టి, చిక్కుబాకీలు పిదప నిశ్శేష పఱచెఁ
బ్రతిదినము దానిసంసారబాధలెల్ల, నెత్తుకెత్తుగ నడపె దుర్వృత్తి నతఁడు. 116

క. ఈతీరున వారపయో, జాతముఖిన్ దుర్నివారసంభోగకళా
చాతురి రాత్రిందివములఁ, బాతరలాడించి గర్భవతి నొనరించెన్. 117

మ. ఒకనాఁ డాధరణీసుపర్వుఁడు తదీయోదగ్రగేహాగ్రవే
దికపై నొక్కఁడు పట్టితెచ్చినగతిన్ దీనత్వ మేపార న
వ్యకపోలంబున హస్తపద్మ మిడి నమ్రాస్యాంబుజుం డై కకా
పిక లైనట్టి మనంబుతోఁ గృపణతాభీతిన్ విచారింపఁగన్. 118

సీ. కీలుగుజ్జుపుఁ గాళ్లపోలికి హత శేష, వంతవ్యయంబు న వర్తనము సలుపఁ
గల్లిబొంగలచేతఁ దెల్లవాఱించేతు, లతివిపాకసితాబ్జ మనుకరింపఁ
గుసుమాస్త్రు తమలంపుఁగొడుపులో యన వ్రేలుఁ, జన్నులు నాభిపార్శ్వమునఁ దవుర
గుమిడికంబులరీతిఁ గౌనలు వంగినబొమల్, పరచాటు కన్నులపై నటింప
గీ. రుంబవిడియంబు పలుతుంపురులు చలింప, నింటిబిడ్డలపైఁ బెట్టి కంటసంబు

లాడుచును వచ్చె విటసమూహమిలంఘ్యు, మానన నావచోఖిల్లి దానితల్లి. 119

వ. అయ్యవసరంబున. 120

గీ. అధికతరరోషభీషణవ్యాఘ్రిఁ జూచి, బెగడి నలుదిక్కులకుఁ బోవుమృగమువోలి
సంవడింపుచు వచ్చునాజరతిఁ జూచి, ధారుణీదేవతంయుండు తల్లడిల్లి. 121

క. వచ్చెఁ గదె విటులపాలిఁటి, చిచ్చుఱపిడు గింకో నేమి సేయుదు ననుచుఁ
జిచ్చుపడి యంతలో ధృతి, దెచ్చుక రక్షకుఁడు నాకు దేవుఁడె యనుచున్. 122

సీ. అల్లంతటనె రాఁగ నావలి కంతలో, దాఁటలేనైతి నెచ్చోటికైన
మునుమున్న తెలిసి యీముదివరాటమునకై, కొంచుగా లేనైతిఁ గోకవాక
మోసపోయితి దీనిముంతవాటునకైనఁ, జేకూర్ప లేనైతి యాకరుట్ర
దాసీజనులకైనఁ దగఁజెప్పి యూరలేఁ, డనిపించలేనైతి హావుణుదప్పి
గీ. తొలుత నే బొంకినట్టిబొంకులు సహస్ర, సంఖ్య లవి యెల్లఁ దలఁచి రోసమున నేఁడు
వచ్చుచున్నది మాటలవశము గాదు, ధూళివర్షన మే మైన దొరకవయ్యె. 123

వ. అని యనేకప్రకారంబుల వితర్కించి. 124

మ. ధరణీనాథ దరిద్రతాపిశునవస్త్రస్ఫూర్తి నాభారతీ
పరవంశోత్తమసూతి చింతిలఁగ నవ్వారాంగనామాతను
గ్ఛరపాండిత్యముఁ జూచి దీనదశకుం లాఁబోలు నీయయ్య జే
పరమేశా యనిపింపఁగా నలదె విప్రస్వామి నంచుం మదిన్. 125

వ. చిరంతనస్నేహ మొక్కింత తలఁచి యాజగజంత యిట్లనియె. 126

క. ఒకపండువ పబ్బంబున, నొకయూరట మైనవేళ నొక్కొకతఱి వే
డుకతనము గాక యిటువలె, సకలము వర్జించి నడువఁ జనునా యోయీ. 127

సీ. కడుఁబిన్నప్రాయ మప్పుడ తాళిఁ గట్టిన, కులమునిల్లా లెంతి కుందవలయుఁ
బుట్టిని ల్లని పెట్టుపోఁత లాసించిన, యక్కసెల్లెం డ్రెంత యడలవలయుఁ
దనయుండు మాకు ముప్పున కందు నని యున్న, తలిదండ్రు లెంత చింతిలఁగవలయు
నందఱిండ్లను నాసయై యుండు నితఁ డని, నిక్కుబందుగు లెంత పొక్కవలయు
గీ. చల్లఁగాఁ జేతికా సెల్ల డుల్లి లొల్లె, కాఁడ వై యిఁక నైన నీకాఁపురంబు
బ్రదుకుపని విచారింప కీపనికిఁ జొరఁగఁ, బడినవానికి నెక్కుడిభారబుద్ధి. 128

సీ. గుఱి తప్పిపోవు ముందఱివిచారము లేదు, సావడి కుఱుగు మచ్చరము పుట్టు
నగరివారుల్ హాసింతు రగ డౌను బిన్నపెద్దలకుఁ జుల్కన తలిదండ్రు లోర్వ
రింటికి నేగి యహా యెవరు మెచ్చరు లేని, గర్వంబుదొట్టుఁ జేకాసు డుల్లు
నొడ లోడుగాఁ జొచ్చు నొడువులపాలగు, సందులఁ దూఱు విశ్వాసమెడలుఁ

గీ. చిన్నపనిగాదు లంజక్కు మన్న వినుము, ప్రజలు మీ రొక రైన మాపయికి వచ్చుఁ
బడుచఁడవు నీవు మాయిడ్డ పసరుమొగ్గ, మ్రొక్కెదము రాకు నీ విదిమొదలు చేసి.

క. అనరాదు గాక నీ వొక, మనుజుఁడవా దుర్విదగ్ధమార్గమె మార్గం
బని విప్రమార్గ ముద్యా, ఘన సేతురె నిన్నువంటి బ్రాహ్మణకులజుల్. 130

గీ. జపతపంబులు గావు శాస్త్రములు గావు, వేదములు గావు సత్క్రియావిధులు గావు
వైదికపుబాస లేవ భూవరకుమార, యోగ్యసౌభాగ్య లగువారయువతు లేవ 131

క. పాప మని నిన్ను నేతిక, కోపండితవాక్యసరణి లాలించితిఁ గా
కోపిన్నవాఁడ విటుడు, వ్యాపార మనంప లంజవారికిఁ బనియే. 132

గీ. అనుచు నయభాషణము లాడి యాపలిక్కి, మంచిమాటల నరుగఁ డీమాల్గుఁబోతు
కఠినతరవాక్యములచేతఁ గాని చక్కఁ, గాదు లొటిపిటకూల రోఁకండ్లఁగాని. 133

వ. అని విచారించి యి ట్లనియె. 134

క. మాకేమి నీవు పోయిన, పోకలఁ బోకుండఁ జేయఁ బొందువలసె నా
తేక చదువేకు రూకలు, కోకలు నిష్ఫలము లైన నోడవలు తగునే. 135

గీ. చదువుకొన్నాఁడ వటుమీఁద సరసముద్ర, కొంత యామీఁద భూసురకులవరుండ
వయ్యెదో నీవెఱుంగవే యర్థమీక, యూరకే పిల్చునే లంజవారిపడుచు 135

క. ఇచ్చకపుమాట లాడుచు, వచ్చెదు మాయిండ్లనుండి వదలవు నేడున్
బచ్చపయికంబు కట్టుము, చచ్చినదాఁకనె యటన్న సామెత వినవే. 137

గీ. మాట లేఁకవేయు నేటికి నేఁటిరాత్రి, చీర పుత్తెంచె నుడిగాలవారిచేత
నూరిమేలికరాజుకుమారుఁ డెల్ల, పెద్దపాకట్లపోవులపిల్లవాఁడు. 138

వ. అని యుత్తరంబునఁ గన రెత్తి విటులపాలిటిమిత్తి మర్మంబు లెత్తి పలుకుచు నత్తఱిం నుత్తరంబునం గృపాయత్తచిత్త యై తత్తరిల్లుబిత్తరికూఁతుం గని బత్తివడక యోసీ మొగమోటకత్తెవై చిట్టిజిత్తులు సేయురిత్తముడికొండ్ర హుజుత్తనిపించక విత్తహాని చేసితి వని చెత్తంబు తీసికొని మొత్తఁ బోయిన. 139

క. ఆపాటి కవల కున్నన్, కోపంబున నన్నుఁ జూడఁ గొట్టుదు దీనిన్
చూపాడువంకలనే 'యా, శా పరమం దుఃఖ' మనుచుఁ జయ్యన నరిగెన్. 140

క. అనిన విని వనరుకములం, బున లేనగ వంకురింప భూనాయకుఁ డో
మునినాథ విప్రుఁ డెచటికిఁ, జనియెం దద నేమిచేసె సకలముఁ జెపుమా. 141

ఆశ్వాసాంతము.

మ. బహుళాపుత్రనిశాకళత్ర మునిశంపావిగ్రహాభోగసం
గ్రహవాంఛా గురుకామినీరతికళాప్రార్థ్యమానాఘను

ర్వహతానిర్మదనార్థముస్సహతపక్షప్రాబల్యసాఫల్యకృ
న్మహానీయైందవసత్కళాభరణరమ్యస్కంధ సోమేశ్వరా. 142

చ. హతసుమబాణ బాణవినుజావసథాంగణవాస వాసవా
ర్చితపదపద్మ పద్మభవశీర్షవిఘాతనిదాన దానవ
క్షితికృతిదక్ష దక్షమఖసంహృతికర్మధురీణ కీణదు
ష్కృతిపరితాప తాపస సమృద్ధికళాలసమానమానసా. 143

ఉత్సాహవృత్తము. చందశూకభూష దోహదాహకా జగత్త్రయీ
కందసంశ్రితాచలేంద్ర కందరా పరాక్రమా
స్పందితారిసంస్తుతత్సుపర్వపర్వతాగ్నిది
క్కుందునూరిపట్టణప్రకాండమండనోదయా. 114

గద్య. ఇది శ్రీకాశీవరప్రసాదలబ్ధవర్ణవర్ణనీయకవిత్వధౌరేయ పెదలింగనార్యగర్భార్ణవా త్రేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానసకలవిద్వజ్జనవిధేయ రుద్రయ నామధేయప్రణీతంబైన నిరంకుశోపాఖ్యానంబను మహాప్రబంధమ్మునందు ద్వితీయాశ్వాసము.





శ్రీరస్తు.

# నిరంకుశోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.



తన్వీధనసాయక
వీతనయాపేక్షదక్షవినిహతిపునరు
ద్భూతివిధాయక కటకీ
భూతభుజంగేశ కందపురసోమేశా. 1

గీ. అవధరింపుము తత్త్వవిద్యావివేక, దళితకామాదిరిపువర్గకలహుఁ డైన
పులహుఁ డిట్లని పలికె నాభూవరేణ్యు, శేఖరునితోడ వాక్యవైచిత్రి మెఱయ. 2

ఉ. వింటివె ధారుణీరమణ విప్రకుమారకుఁ డప్రబుద్ధి నా
కంటకురాలు పల్కినవికారపుమాటల దుఃఖితాత్ముఁ డై
యింటికిసైతముం జనక యీశ్వరసంఘటనంబె తోడుగా
వెంట సహాయసంపదలు వేఁడక పోయె నరణ్యభూమికిన్. 3

క. పోవుచు నెదుట ధరిత్రీ, దేవతనూజుండు గాంచె దిగ్దంతిజిగీ
షాశ్రుతమత్తేభఘ, టావార్యవిహారగహన మగుగహనంబున్. 4

సీ. కఠినకాకోలూకికావిలోకనసాధ్వ, సాకీర్ణకోకిలాకోకిలంబు
కాద్రవేయమయూరికాసముత్కటకంఠ, ఘోషార్తమూషికామూషకంబు
కరటికంఠీరవికాకర్కశస్వ, రవ్యాకులసూకరీసూకరంబు
కరివైరిభేరుండికాకఠోరాక్రంద, కాతరకాసరీకాసరంబు

గీ. కురువకాశోకవకుళతక్కోలకేత, కీకురంటకకుటజకంకేళికతక
కాకతిందుకకింశుకక్రముకతిలక, కాంచనకదంబకలిత మక్కాననంబు. 5

వ. నిరంకుశతరంబుగాఁ జొరంబడి పోవునెడ దురాలోకనిరాలోకశోకపైకకాకాతిరేక
రేఖాకిమ్మీరితాకారప్రాకారంబును నిజభుజాదండకోదండపాండిత్యవషత్రాకృతనిష్పత్రా
కృతపోత్రిపలలపచనపర్యుత్సుకపుళిందసందోహదందహ్యమానానామహిషపురీష
కరీషోల్లసితభసితస్తోమగృహకుట్టిమంబును ప్రకటపటువిటపిఝాటపటలవేల్లితఝిల్లికా

ఝంకారప్రతిధ్వానసంధానచంగరంగమంటపంబును విశీర్ణద్వారదారుతురంగకశే బరచరద్గ్రహగోధికాగృహమేధికల్పితానల్పసౌభాగ్యసూచకశకునాతిథ్యనిరంతరాళంబును నమందానందచలదుందురుచుచుంచరీబృందసందీపితార్చటీనిర్భరగర్భగృహంబును నగునొక్కపాడుగుడి గాంచి సమంచితయానంబున నొబ్బునఁ జేరంబోయి గుబ్బతిలు గబ్బిలపురెట్టగబ్బు దను నుబ్బనీక తదనంతరంబునం గూర్చుండి పథశ్రమసమాపనావసరంబున. 6

క. జననాథధారుణీశ్వర, తనయుఁడు తనయెదుట విమలతరకాంతులకుఁ
గనియగులింగముఁ గని యిట్లని పలికెఁ దైవఘటన కనుకూలముగన్. 7

మ. జగదాశ్చర్యకరప్రభావ మగునీసర్వజ్ఞవిఖ్యాతి యే
నుఁగు దిన్నట్టివెలంగకాయగతి నొందుఁ లోన లోపై బయల్
సొగసై యుండెడిదో విశుద్ధతరమో చూడంగ నాతోడుతఁ
సొగటాలాడెద వేనవేందుకుసుమస్తోత్రవ్యజూటాంతికా. 8

సీ. గిరిసార్వభౌముకూఁతురుసన్నిధానంబు, నందు మేలము లాడునట్లు గాదు
కైలాసశృంగశృంగారచందనవాటి, నల్లన నడయాడునట్లు గాదు
వెలిగిబ్బ నాకాశవీథిఁ బోడెంబుగా, నవలీల నెక్కుడునట్లు గాదు
తొలివేలుపులమూఁకఁ దురములో గోరింపు, లాడి తాండవమాడునట్లు గాదు
గీ. మానితద్యూతవిద్యోతమానకీర్తి, మన్నరాగ్రణి నైనట్టినన్నుఁ గూడి
జూదమాడుట సింధురాసురవిజేత, యూర వెక్కసితన మన్న నంటిఁగాని. 9

లయగ్రాహి.—
ఓచరమభాగ్యభృతఖేచరదురోదరకళాచతురశేఖరుఁడ వై చిరతరేచ్ఛఁ
బ్రాచిఁగలప్రోడల నవాచిఁ గలజాణలఁ బ్రతీచిఁగలతజ్జ్ఞుల నుదీచిఁ గలప్రజ్ఞా
సూచకుల నవ్వహముఁ జూచితిఁ గరాబ్జమునఁ బాచికలు ముట్టిచనఁ జూచినమహాత్మ్యుఁ
నీచరణ మాన వలయాచలపరీతనిఖిలాచల మెఱుంగ మిముఁ జూచుకొను టింకన్. 10

గీ. పట్టిమాటలు గా వెంతవారి నైన, గెలుచునర్తకి నాపాలఁ గల దటంచు
నవనిసురతనూభవుఁడు చేలాంచలమున, ముడియ గట్టినసొగటాలు విడిచి పలికె. 11

సీ. వేళంబుగా నభోవీథి దువాళించు, గిబ్బతేజీకినా కృత్తివాస
రింగులువారఁ దీర్చినవేయిమంగుల, తలపాగకా దేవతావరేణ్య
బిరుదురాకాసులఁ బరిమార్చుముప్వంక, పట్టెసకా మనోభవవిరామ
పలకారిచిన్నిబెన్నెలగాయుపసిపూవ, జాబిల్లికా శైలజామనోజ్ఞ
గీ. పసిమిపసిడిదిండివలువకా ఫాలనేత్ర, వెండి నిండారుకొండకా విశ్వభర్త
లోకసామ్రాజ్యమహిమకా లోకవంద్య, యొప్పు పన్నిద విందులో నొకటి కైన. 12

క. ఏలా పలవనిసడి నీ, చేలాయుధవాహనములు చేకొన మాకున్
వాలాయము గావించెద, ఫాలాంబక లంజలంజ పన్నిదమునకున్. 13

వ. అని పలికి యమ్మహాదేవునివలనఁ బ్రతివచనంబు గానక యిట్లనియె. 14

క. పూనిన నోటమి తప్పదు, దీనికి మా టిపక యున్నదియె నయ మనుమన్
మానము దాల్చిన గుట్టునఁ, బోసీఁడు నిరంకుశుండు భుజగవిభూషా. 15

క. తగ దింతటి సర్వజ్ఞత, దిగనాడుము లేక నన్ను దీకొను దీనన్
"జగబిరుదు ముండమోపియుఁ", దగవే నీ వెఱుఁగవే సుధాకిరణధరా. 16

గీ. ఎన్నివిధముల మా టాడకున్నయట్టి, గట్టిపూనికి నీయందుఁ గలిగె నేని
దాని కొకయుక్తి మును మున్నె తలఁచినాఁడ, మిసుగవచ్చునె విటశిఖామసుమ మెదుట.

క. నీయెత్తు నేనె యాడెద, నీయెడలం బొంకుతేక నవిద్యకుఁ బ్రా
తేయాద్రిసుతాజీవిత, నాయక నెత్తంబు కారణం బెఱుఁగుదువా. 18

క. అని పాళి శైలకన్యా, స్తనపాళీనామకేలితామరసరసా
యనలోలుపాళియెదుటం, బొనరించె విరించివంశభూషణ మధిపా. 19

మ. ధృతి పెం పొందఁగ సారెసారె పయిసారెం జూచుచు న్సారె వో
వుతఁజెం బోవుచు జోడుగట్టుతటి రివ్వు త్తిఱ జోడించుచున్
జత బారా పది దచ్చి యిత్తిగ దుగా చౌవంచ తీవంచ బొం
కితినాన ర్తకి యంచు నాడె నుభయాంగీకార మేపారఁగన్. 20

క. ఈరీతి నక్షవిద్యా, పారీణత మెఱయ నుభయపక్షజయాపే
క్షారూఢచిత్తుఁడై ధీ, గౌరవ మెసఁగంగ నాడఁగా దైవగతిన్. 21

క. తనయాట గెలువ లక్ష్మీ, తనయాటవిదహనుఁ జూచి ధరణీసురుఁ డి
ట్లను మానవతీరత్నము, ననుమానములేక యొసఁగుమా నిపుణతమా. 22

క. మును లంజలంజ పన్నిద, మని యాడితిఁ గాని యిట్టి దట్టిది యని యా
డినవాఁడఁ గాను గద నా, మనసు సుమీ వారయువతి మన్మథమథనా. 23

సీ. అలకాధిపతిసూనుఁ డమరవేశ్యలలోన, మే లెంచి పొందు నేలోలనయనఁ
బ్రధనరంగములోనఁ బ్రాణంబు లుంకువ, గా నిచ్చి పోను రేకలికితోడఁ
గ్రతుతంత్రముల దేవగణముల సంతోష,పఱచి కాంక్షింతు రేపద్మనయనఁ
గఠినంపుతపములు గట్టిపెట్టి మునీంద్ర,కోటి యాసింతు రేకువలయాక్షిఁ
గీ. త్రిభువనాశ్చర్యసౌందర్యరేఖచంచ, లాలతాంగుల కేయింతి మేలుబంతి
యాదురాషపరంభ యంకయుగ్మ, రామణీయకజితరంభ రంభఁ దెమ్ము. 24

క. విన్నావో వినవో నితిస, మ్మున్నతు లడఁగించుకొనఁగ నొప్పనివి ధరన్
బన్నిదమును మఱియేదో, యన్నాగుచుమిా మదావళాసురభేదీ. 25

తరల. తగు నె పన్నిద మీక యీగతిఁ దప్పుమానము దాల్పఁగాఁ
వగవు నీకును నాకుఁ బెద్దలవంచఁ బెట్టెదఁ జండి నై
గగనకేశ యటంచుఁ జందురుకావిసేలు గళంబునన్
బొగడదండ యొనర్చి వావిటభూసురాగ్రణి దిట్ట యై. 26

గీ. తాము గనిపించ కుండి గంధర్వయక్ష, భుజగకిన్నరముఖ్యులు పొగడ దండఁ
బొగడదండయుఁబోలె నప్పొగడదండ, కాలకంధరు మెడ కలంకార మయ్యె. 27

వ. ఇవ్విధంబున నవ్విప్రకుమారుండు బుష్పకోదండజయవిరాజితుం బరాజితుంజేసి యి
ట్లనియె. 28

సీ. తగ వంటిమా నీకుఁ దగ వెక్కుడిది భక్తి, పారీణునిల్లాలిఁ బట్టినావు
తెగు వంటిమా నీకుఁ దెగు వెక్కుడిది వెండి, కొండ యుండఁగ భిక్షు గోరినావు
గుఱు తంటిమా నీకు గుఱు తెక్కుడిది భక్తి, నంబికిఁ గుంటెన నడచినావు
బిరు దంటిమా నీకు బిరు దెక్కుడిది పాండు, నృపకుమారునకుఁ గిరిందుపడినావు
గీ. దొరతనం బంటిమా నీకు దొరతనంబు, గలదె బాణునివాకిలిఁ గాచినావు
నిన్ను సర్వజ్ఞుఁ డని కొల్చునిర్జరాళి, నెన్ను టంతియకాక నీ వేమిసేతు. 29

గీ. నీమహాధన్యవృత్తికి నీకు నార్య, భాగ్యసంపన్న గుణధుర్య భార్య యొక్క
చట్టుకూఁతురు గలుగ నీజాము వేగ్గె, గాని లేకున్న మఱి చెప్పఁగలదె నిన్ను. 30

క. నీగూంబజంకెలకు ను, ద్వేగపడం గుసుమశరుఁడె విటసింహుఁడు వే
వేగఁ గమలాక్షిఁ దెచ్చెద, వో గరువతనంబు వాసి పో నెంచెదవో. 31

క. బరిదప్పి తప్పుచేఁతలఁ, బొరలక యిపు డోడినట్టిపొలఁతుకఁ దే నీ
యఱచేతఁ బండ్లు వచ్చునఁ, గఱతువుగా కిక్షుకార్ముకప్రతిపక్షా. 32

చ. అని యనిమేషభూరుహసుమాసమదామలలామవాసనా
ఖని యగుపార్వతీధవునికంఠమునం బగిలించినట్టికాం
చనమణిరుచ్యమాననిజశాటిచెఱంగులు గూడఁ బట్టి నీ
పని యన నెంత వేగిరమ పన్నిద మి మ్మని తీయ నయ్యెడన్. 33

ఉ. సత్యవచోవిశేషపరిషక్తుఁడు గావున నోడియుండిరో
యత్యధికుండు దేవుఁ డని యంజనిదౌష్ట్యము చూచి మెచ్చిరో
భృత్యుఁడు వీఁడు మాధ్యమునఁ బేశలుఁ డంచు ననుగ్రహించిరో
మృత్యుమదాపహంత యురరీకృతభూసురధూర్తమార్గుఁడై. 34

సీ. నిబ్బరంబునా వచ్చి నిలిచినయూఁకున, వెలిగిబ్బ యిరుగెలంకులకు దాఁట
గమనవేగంబున భ్రమసి కేయూరంపు, దందశూకములు వక్త్రములు తెఱవ

నెగసి చివ్వునఁ గ్రుంకుగగనవాహినిద్రేఁక, మున జటాజూటంబు వెనుక కొరగ
జాఱి హస్తసరోజసన్నిరుద్ధాంతమై, బెళబెళఁ బసిదిండివలువ మెఱయఁ
గీ. బతనభయసమాలింగకపర్వతేంద్ర, కన్యకాబాహువల్లరీగాఢవేష్ట
నప్రదీపితాశ్రితకల్పనగము వేగ, సంభ్రమత వచ్చి హరుఁడు సాక్షాత్కరించె. 35

సీ. ఎంతదూరము వోవు నీశ్వరుం డని శౌరి, విహగేంద్రుఁ బోఁడెంబు వెడల విడువ
నచ్యుతుం డెచటికో యరుగుచున్నాఁ డని, బమ్మ ఱెక్కలతేజిఁ బరువుదోల
నజుఁ డంత వెడలిపోయెఁ జుమియంచు సురేంద్రుఁ, డైరావతంబుఁ గాలాడిపఱువ
నింద్రుఁ డూరక పోవు నెచటికో యని వహ్ని, పొట్టేటివారువంబును గదల్ప
గీ. వాఁడె శుచి యంచు యమదైత్యవరుణులాత్మ,వాహనంబులు జోడింప వారిఁ గూడఁ
బవనపౌలస్త్యపశుపతుల్జవనరూఢిఁ, బరఁగుతమసాహిణముల నిబ్బరము చూప. 36

వ. చేర వచ్చి రప్పుడు. 37

క. గజగజ వడఁకుచు భూసురుఁ, డజగవధరుఁ జూచి సాధ్వసావేశమున
న్నజనంబు మఱచి యుండిన, రజనీకరమౌళి సాదరముగాఁ బలికెన్. 38

ఉ. ఓడకు వోయి భూసురకులోత్తమ నెత్తమునందు నీకు నే
నోడితి నీవు గెల్చితి సమున్నతి నన్నతిరోషవృత్తి నీ
వాడినయంతవట్టు సహజార్థమ యర్థమహాభిలాషివై
యోడినపన్నిదం బిడక యుండినఁ జండినకోఁ దలంపరే. 39

క. అరిపురము లభ్రిచరములు, గిరికార్ముకకేళిఁ గలవ గెలిచినవన్నక్
ధర నాటపాట గెలిచిన, నిరుపమసాహసికమణివి నీకుం జడుపే. 40

క. అని భయము దీర్పఁ దీర్పను, దనహంతకు నంతకుం బదంబునఁ బ్రహరిం
చినయధ్వరోపరంతకు, మునుకొని దండప్రణామములు చేసి తగన్. 41

గీ. పూలనేసినవాని నిర్మూలపఱచి, ఱాలనేసినవాని హేరాళి మైన
లీలఁ గరుణించితివి దయాశీల నీకుఁ, జాల నపరాధి నంచు నాకేల వెఱవ. 42

ఉ. ఊపరిమాత్ర సన్నుతగుణోన్నత యున్నతలంపు లేల ల
క్ష్మీపతిసేవ్యమాన మగుమీ జగదద్భుతమూర్తిఁ గంటి నా
పాపము లోప మయ్యెఁ గడుఁ బాత్రచరిత్రుఁడ నైతి నింక నీ
శ్రీపదపంకజాతములు చేయవే కృప వేగ నావుడున్. 43

శా. ఓహో నిల్వు పయోరుహాసనకులోత్తంసంబ సత్యాహత
వ్యాహారంబులు పల్కసాగితివి బా గాయెం జుమీ యీ వరా
రోహారత్నము నీవు సైకొనక కోర్యుక్తిఁ జంగా ముక్తికాం
తాహారాళిసుఖంబు గోరెదవు బాదం బాడితే దీనికిన్. 44

ఉ. ఆడితి మున్ను బొంక నని యక్షవిచక్షణవృత్తి నేల బొం
కాడెద వాడకాడకు నలాసనవంశపయోధిచంద్ర నే
నోడినయంతె కాక మఱి యున్నపదార్థము లీయ నేర్తునో
పాడియె నీకు వేఁడ సరిపన్నిదగాండ్రు హసింప నియ్యెడన్. 45

వ. అని యనేకప్రకారంబుల నాతనితో మేల మాడి యిట్లనియె. 46

ఉ. భూసురవంశపావన యపూర్వతరంబునుగాదు ముక్తికాం
తాసుఖ మేల కోరెదవు దానికి సందియ మింక మానుమా
దాసుఁడ వీవు నాదివిజతామరసాక్షి గ్రహించి మానసో
ల్లాసము నొంది ముమ్ములఁ దలంచుచు నుండఁగఁ గొన్నినాళ్ళకున్. 47

క. అని పలికిన విని భూసుర, తనయుఁడు సాష్టాంగ మెరఁగి తగ నిట్లనియె
న్నినుఁ గనినయంత ముక్తికి, ననుమానమె తెలియఁ జాల నైతిం జడతన్. 48

మ. అపరాధంబులు పెక్కు చేసితి మహాహంకారకామక్రియా
విపులాంభోనిధిఁ గ్రుంకువెట్టి జడతావేశంబుచ న్నిమ్ము ది
వ్యపథోద్వృత్తినిఁ గొల్వ నైతిని మనోవాక్కాయకర్మంబులం
జపలాత్ము న్నినుఁ బ్రోవ మీదయయ కా సాక్షాత్కటాక్షేక్షణన్. 49

మ. నిలుపం జాలను నీశివాఖ్య మదిలో నిక్కంబుగా నీకథల్
బలుకం జాలను వాక్కులన్ వెలయ శ్రీపాదాబ్జసంసేవనల్
గెలువం జాలను దేహకర్మములు దుష్కృత్యోత్సుకుఁడన్ నామన
శ్చలనంబు ల్దొలఁగించి ప్రోవవె శివా సద్భక్తరక్షాచణా. 50

ఉ. దేవ మహానుభావ జగతీధరకార్ముక దుర్భవాపహా
మావరరోప భక్తజనమానససారసలోకబాంధవా
గోవరవాహ దుర్వినయకుంతితకాననదావపావకా
ప్రోవఁగదయ్య మృత్యుహర మూర్ఖుని నన్నొకకాశ్యపీసురున్. 51

సీ. ప్రణవవృత్త్యభిరామ రామాసహితవామ, వామాహిరాడ్దామ సామకామ
రజనీచరకిరీట రసజాసనకరోట, గగనగంగాజూట నిగమఘోట
యచరచరాధార యచలాధరాగార, నీరధితూణీర నిగమసార
దురితాభ్రవాతూల కరధృతాసమశూల, నాగాజినదుకూల నయవిశాల

గీ. దళితభవసైన్య యాదిమధ్యాంతశూన్య, హితజనశరణ్య సర్వలోకైకమాన్య
నిరుపమాగణ్య విస్ఫుటానేకపుణ్య, సత్కృపానన్య దీనరక్షావదాన్య. 52

క. జయజయ శర్వ సదాశివ, జయజయ రతిరాజవిజయ జయజయ మృత్యుం
జయ జయ మాం జయపాలా, జయశీలా సకలభక్తజనతాలోలా. 53

వ. అని యనేకప్రకారంబుల నుతింపుచుఁ గరతలకమలాంజలీబంధప్రసిద్ధసిద్ధాంతానంద
వేదిప్యమానమానసుండై యున్న యవ్విప్రకుమారుఁ బల్మాఱు గారవించి దదాశ్లే
షంబగునట్లుగా నభయం బొసంగి పదంపడి యమరలోకసాంద్రతరంగిణీంద్రచంద్రుం
డగు నింద్రు నిస్తంద్రత నాలోకించి విరించిప్రముఖాంచితపదపంకజుం డగు శంకరుం
డి ట్లనియె. 54

క. వినుము సురేశ్వర భూసుర, తనయున కిపు డేను మెచ్చి తగ నిచ్చితి రం
భను దానికి చెలి విమ్మా, వనజాసనకులవరేణ్యావర్ధను నెనయన్. 55

గీ. అనిన విని పాకశాసనుఁ డామహేశుఁ, జేరి దండ ప్రణామము ల్సేసి పిదప
నాయజితరంభ కిపరబక్షోజకుంభ, హసితకరికుంభ యగురంభ కనియెఁ గాంచి. 56

క. ఓనాతి యీమహీసుర, సూనునకు నభీష్టకామసురతక్రీడా
మానసుఖ మొసఁగి రమ్మన, నాంచలినాక్షియును మంచి దని మ్రొక్కె తగన్. 57

వ. అట్టి నంతట మహేశ్వరుండును నిఖిలామరసమేతంబుగా నంతర్ధానంబు సేసె నమ్మ
హీసురసూనుండును నాదివిజనారీరత్నంబు నవలోకించి చేరం జనుదెంచి విస్ఫుట
పాళీగాలింగనం బొనరించి పునఃకృతపరిరంభనంబు న్వేలయ వెలయుచుండి ర య్యి
రువురు. 58

సీ. చంపకమాలూరమందారకేయూర, తిందుకాశోకమాకందకుంద
కేతకీవకుళకంకేళికాననసేవ, తాలహింతాలజాతీలవంగ
ఘనసారకదళీకాక్రముకామలకనింబ, జంబీరబదరీరసాలసాల
ప్రముఖపుష్పితలసత్ఫలితపల్లవిత, విస్తారభూమీరుహతతుల వెలయు

గీ. నట్టితత్కాననమునందు నవ్యకీర, రవము లుప్పొంగ నిందిందిరములు మెలఁగఁ
గోకిలలు గూయ మృగములమూఁకఁ డాయ, మరుఁడు సుమశరమున నిరువురను నేయ.

క. ఉపవనమునఁ బోలె విహా, రపరవశు లగుచును దిరిగి రయమతి నతిర
త్యుపరతి సమరతి మతి మతి, నిపుణతఁ బెనఁగొనిరి చెలఁగు నేర్పులకోలఁదిన్. 60

వ. ఇట్లు గణ్యాపుణ్యాలావణ్యాతరకరకంకణఘుణఘుణత్కారనినాదంబు లెసఁగం గాఁగి
లించుచు నిబ్బరికన్ నుబ్బి గొబ్బున గుబ్బచిల్లుగబ్బిగుబ్బల నురంబునం బొరయ నురుము
చుఁ గంధరాపరిరంభణంబుల మొగంబు మొగంబునం జేర్చుచుఁ దిరస్కృతకిసలయ
బింబాధరపరసమ్మదులసన్మధురిమాధరీణామృతంబు లోలుక మదనకదనదాహంబు దీర్చు
చుఁ బదవదసుధారసంబు గ్రోలుచు రదనక్షతంబులు గావించుచు నంతకంతకు నెక్కు
డై నిశితాంకురదురంతలతాంతమార్గణగణాగణితాగ్నికీల లుద్ధతి నోలయింప హుమ్మని
ఓ ట్టోపవృత్తమకమ్మునఁ గ్రమ్ముకొను బిగిచన్నిట్టల చిట్టంబున దిట్టంబుగ బెట్టైనయఁ
నిక్కటిలుమానాశిఖిచితమహారజతకంచుకం బవియ నుట్టిపడునిట్టూర్పు లుల్లసిల్లఁ బయ్యెఁ

పారావారాంతరచలన్మంధరధరంబు తెఱం గెఱంగించుమురువునం బెనంగుచుం గుచమండలనఖక్షతార్ధచంద్రోదయంబు లుప్పొంగ మందస్మితచంద్రికలు వెలుంగ స్వేదకణతారకామండలంబు వెలయ నేత్రకువలయంబులు ప్రకాశింపం జివురాకుశయ్యాం బవ్వళించి యించుక నిదురించి మేలుకాంచి హస్తారుణోదయకిసలయంబులం గలితాలకాంధకారంబులు వొలంగ న్సవరింప నసతోషణంబుల ముఖకమలంబులు వికసింపం గంచుకోత్తరీయోదయరాగంబులు చక్కంగాంగం గుచకోకంబులుడాంగ స్వేదకణనఖక్షతతారకాబ్జంబులు గ్రుంక మానసానందామృతాననిషేచనానంతరనిటలతట పూర్వదిగ్ధృతకుంకుమవర్తులతిలకాబ్జబాంధవోదయానంతరంబున. 61

. ఆసుదతి ముదమెలర్పను, హీసురసుతుం గౌగిలించి హితమతిం బలికెన్
ఏసతి పుణ్యవతియొ నీ, తో సురతము నిరతమెనయుం దొంటిఫలమునన్. 62

. ఈతీరున సురతవనముల, చేతిమ దనియంగ నెఱుంగం జెప్పెడి దేమీ
రాతిరి పగలై పగలే, రాతిరియై వెలయుచుండె రతిపరవశతన్. 63

. మనసిజకేళికి భూసుర, తనయా నీసాటి రారు దలంపంగ నేలా
యనరాదు గాని దాసులు, వినుమా నలకూబరాదివిజయవిశాలుల్, 64

. అని దివిజకాంత భూసుర, తనయునిం గీర్తించుచుండెం దా మోహితయై
విను సుగుణ నీవు గావున, నచుం బొగడితి ననుచు ననియె నాభూసురుండున్. 65

. అపు డాద్విజుండును దివిష, చ్చపలాయతనయనం గూడి చనుదేఱంగ నా
విపులారణ్యముచెంగట, నుపమానూన్యమగుపురము నొక్కండు గాంచెన్. 66

. కాంచి తత్పట్టణంబు చేరం జనుదెంచి. 67

. అచ్చట సుఖులై వారు వి, యచ్చరరాడ్భోగ మెనయ నతులప్రౌఢిన్
బచ్చవిలుకానికేళుల, నిచ్చమెయిం జరపుచుండి రిరువురు వెలయన్. 68

## ఆశ్వాసాంతము.

వ. ఘనఘన నవ్యానవ్య సితకంధరకంధర దానదాన వే
ధనధన తప్తతప్తకృతతారకతారకధామధామ వా
రణారణరంగరంగదరిరాజితరాజిత దారుదారు కా
వనవన ధీనధీనవృషవాహనవాహన సోమశేఖరా. 69

మాలిని. గగనపురజిగీషాకాలకూటాన్నతోషా
నిగమహరసువేషా నేకపుణ్యప్రభాషా
యగణితఫణిభూషా హార్యచాపానునీషా
విగతసకలదోషా విస్ఫుటానన్యపోషా. 70

క. మోహజ్వరభైషజ్యస, మీహితకైలాసరాజ్య మేదురతేజా
జేహాయమానదానవ, బాహాధార్ష్ణ్య త్రిదివపాలకపూజ్యా. 71

గద్య. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధ లబ్ధవర్ణవర్ణనీయకవిత్వతత్వధౌరేయ పెదలింగనార్య గర్భాబ్ధిపూర్ణిమాత్రేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానమానస సకలవిద్వజ్జనవిధేయ రుద్రయనామధేయప్రణీతం బైననిరంకుశోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.





శ్రీరస్తు.

# నిరంకుశోపాఖ్యానము.

## చతుర్థాశ్వాసము.



రమణీరమణీయప
రీరంభస్నేహవిస్ఫురితసాయక ని
ర్ధారితనుమనస్సాయక
భూరికృపావేశ కందపురసోమేశా. 1

గీ. అవధరింపుము తత్త్వవిద్యావివేక, దళితకామాదిరిపువర్గకలహుఁ డైన
పులహుఁ డిట్లని పల్కె నాభూవరేణ్య, శేఖరునితోడ వాక్యవైచిత్రి మెఱయ. 2

క. ఆరీతి నతఁడు దివిషు, న్నారీతిలకంబుతోడ ననువుగ సురతా
పారవ్యాపారశ్రీ, పారగభావమున భ్రాంతిపడి వర్తిలుచున్. 3

వ. ఒక్కనాఁడు తనతోడఁ గ్రీడింపఁ ద్రిదివంబునుండి వచ్చినయయ్యచ్చరలేమయుం
దానును విలాసార్థంబుగఁ బురంబు వెడలి. 4

సీ. సరసీరుహానవీనతరసీధురసపాన, భసలసుందరగానభాసమాన
మసమానసహకారలసమానఫలవార, ససమాదరకుమారసమదకీర
మవనాదరణదారపవనాలసవిహార, భవనాగవిస్ఫారభవ్యహార
మవమానలవదూరపవమానసంచార, భవమాంద్యవిస్తారఫణివిహార

గీ. మంచితవిహంగమమురాజహంసచంచు, దళితఫలసారజలపూరమిళితఫలిత
కలితఘనశాలివనశాలిఖండమండ, లావరణదీవ్యమానము ద్యాన మొకటి. 5

గీ. చూచి యచ్చోటిమహిమకుఁ జోద్యపడుచు, ముమ్మరంబుగఁ బూఁదేనెముసురు గురియ
నచ్చుతరగుచ్ఛములమీఁద నళులు గ్రమ్మ, దెప్పరం బగులేఁదీఁగెచప్పరమున. 6

సీ. వదనచత్వరవిస్ఫురత్వరరసజ్ఞారవో, న్నిద్రతాదికృష్యాలముద్రుజంబుఁ
గనకకంకణఝుణత్కారసముత్పాత, పంచాంగుళప్రియంభావుకంబు
మధురాధరోష్ఠసమంతాన్నిపీడనా, ద్ధత్యానకంపావితంపచంబు
సజ్ఞాతపూర్వరత్యన్నత్యపురుష, క్రమణయాచ్ఞావచోభ్రంలిహంబుఁ

వ. అంత నక్కాంతాతిలకం బాతనితో ని ట్లనియె. 17

ఉ. ఎక్కడివాఁడ వోయి యొక యింత యెఱుంగవు బుద్ధికౌశలం
బెక్కడ కేగె నాలుకపయి న్నువుగింజయు నానవట్టి బ
ల్లక్కరి నారదుం డతఁడు దైవతమార్గమునందు నేగఁగా
నక్కట నన్నుఁ బేరొకనితి వాతఁడు విన్న ననర్థమొందదే. 18

క. ఆతఁడు విన్నప్పుడె పురు, హూతుఁడు వినుటయును బుద్ధి నూహింపు శచీ
నేత విని నేని వెత యగు, చేఁతయె కాఁ బలిసికొనుము సిద్ధము గాఁగన్. 19

గీ. మనము చేసినసుకృతసంపద నతండు, విడక పోయిన బ్రదికితి మనఘవర్య
విన్నయప్పుడె యొకకీడు వెదకుఁ గాని, మాని పెట్టింతంత్రంబుఁ గానలేఁడు. 20

క. ఆమాట విని యొకించుక, భూమీపతి నవ్వి మానిపుంగవ కరుణా
ధామఁ డగు నారదునకే, భామామణి యింత యేల భయపడియె నొకో. 21

వ. అని యడిగిన ధర్మశీలునకుఁ బులహుం డి ట్లనియె. 22

సీ. దివిజకాంతామణి యవనీస్థలంబున, కరుదెంచు టపరాధ మాన కాద?
యది యునుంగాక మోహావేశమున మర్త్యు, ననుభవించుట నేర మాన కాద?
యింతమాత్రమె చాల కేప్రొద్దు వానికి, ననుకూల యగుట తప్పౌన కాద?
యది కారణంబుగ నమరేంద్రుసేవకు, నరుగమి యాగిదం బౌన కాద?

గీ. చూడుమా యెన్నివిధములఁ జూచికొన్న, రంభయొడ దుండగమె ధరారమణవర్య
యది యెఱిఁగి చేరరాదయ్యె నమరమౌని, కొండెగానితనానకు గురువు గాన. 23

గీ. భూసుపర్వున కొకనాఁడ పోయి కౌఁగి, లిచ్చి రమ్మని పంపినాఁ డింతె కాని
సంతతము వానితోఁ గేళి సల్పుమనుచుఁ, బనిచెనే తన్ను లోకైకభర్త యైన. 24

క. ఈమాటలు ముని దివిజ, స్వామికి వినిపించెనేని జననాథ యతం
డే మని శాసించునో యని, యామానిని యతని కంత యలికెం జుమ్మీ. 25

వ. ఇది యిట్లుండె నట నారదుండు చని యెదుట హాహాహూహూముఖ్యవిఖ్యాతగాయనగేయనవీనమాధురీఝరీతరంగనినదాయమానమేనకాద్యప్సరఃపాత్రవిచిత్రకంకణఝుణఝుణత్కారచామీకరమేఖలాకింకిణీఘుళఘుళనూపురకలకలధ్వనులచే సంతసించుచు సంతతానందమానత్రయస్త్రింశత్కోటిదేవతాసంసేవ్యమానుండై రత్నసింహాసనంబున నాసీనుండై యున్నసహస్రలోచనుం గాంచి నిలిచిన 26

క. మునినాథుఁ గాంచి సురపతి, ప్రణుతసమారాధనార్ఘ్యపాద్యాదివిధు
ల్విస్మయమున నొసఁగి యర్హా, సనమునఁ గూర్చుండ నునిచి సలలితబుద్ధిన్. 27

క. మునియనుమతిఁ దానుచితా, సనముఁ గూర్చుండి సత్ప్రసంగంబున నో
యనఘాత్మ యెచటి కరుగుచుఁ, జనుదెంచితి రిటకు నాదుజన్మఫలమునన్. 28

క. అన విని ముని దరహసితా, ననమున సురలోకనాథ నానాదిశలం
జని భువిని జిత్ర మొక్కటి, గని వచ్చితి నీకుఁ దెలుపఁగాఁ బనిగలనై. 29

క. మునినాథ యేమిచిత్రము, గనుగొంటివొ యానతీయఁ గదవే యనిన
న్వినవోయి నముచిసూదన, యనిమిషతరుణీలలామ యవనీస్థలిఁ బోన్. 30

క. అలనాఁటనుండి ద్విజునిం, గలగొని యిట రాక యుండెఁగా దానికి నా
యిలవేల్పె యిలువేలుపు, బలభేదన యేమిచెప్పఁ బనియున్న దిఁకన్. 31

క. సురతనయులసురభోగము, నిరసింపఁగ వింటి దాని నేమనఁ గల మో
సురనాథ నిన్ను యనవలెఁ, బరిపాలన యిట్లు చేయఁ బఱపితి వనుచున్. 32

గీ. కావ నీభోగసంపద ఘనము లిచట, సొంపు పెంపును రంభకు నింపు వుట్ట
దనుచుఁ దోఁచుచు నున్నదో యనిమిషేంద్ర, మానవులమీఁదియధిక సమ్మదము చూచి.

చ. మనవలకూబరాదు లవమానము నొందెద రందు నాఁడె యో
యనిమిషలోకనాథ యది యాధరణీసురపుత్రు తోఁడ నా
డినవచనంబు లెల్లఁ బ్రకటింపను నట్టివి బైట పెట్టఁగా
మునులకు మాకు నేల పని మోహముగా కద్ది దానిపాప మే. 34

చ. అన విని వజ్రి మండిపడి యా తపసు నారద యద్దురాత్ము రా
లనిమిషలోకభోగభర మల్పముగాఁ దలపోయ కున్న న
మ్మనుజుని బాయ కున్నె బళి మంచిది దానికి నేన గర్వముం
బెనిచితి నిన్నినాళ్లు నిఁకఁ బెద్దఱికం బోకయింత కుంచెదన్. 35

ఉ. ఓమునిసార్వభౌమ సరసోక్తుల బాపనిమిండగాని
నే మని నింద సేసె జగదీడితరూపవిలాససంపదు
ద్దామశరీరులం ద్రిదశధామకుమారుల లంజసాని నే
శ్రో 'మనస శ్శునాం ఘృత మరోచక' మన్నలు కాచరింపునే. 36

సీ. యజ్ఞతంత్రములందు హవిరన్నములచేతఁ, బుంఖీభవించినపొట్టక్రొవ్వు
జగదేకసౌందర్యచాతుర్యములచేత, దుర్వారతర మైనగర్వరేఖ
సురతనూజులతోడి సురతసంసర్గచేఁ, గంపళించినమహానందగరిమ
నిపుణత దీపించునృత్యనైపుణిచేతఁ, బెంపారఁబెంచిన పెద్దఱికము

గీ. సరససంగీతసాహిత్యపరిచయమును, బ్రథను చెందినబహుమానపాటవంబు
కొంత దివ్యులలోపలఁ గొఱఁతవడఁగఁ, గొఱఁత వేయింతుఁ గను దీనికొఱకుదాని?

వ. అని పల్కు నవసరంబున. 38

సీ. మోవిపైఁ గనిపించుములువాఁడిపలునొక్కు, లోఁగిఁ జిన్నికెంపులసొగసుఁ జూపఁ
చెక్కులపై జాఱి చెదరుకుంతలములు, మకరికాపత్రసంపద వహింప
జిగిగుబ్బచన్నులఁ జిబుకుగంధపుసరు, ల్జిలుఁగుఁ బయ్యెదలోనఁ జెంగలింప
నలువొందునునుమేని నవనఖాంకురములు, బాలేందురేఖల పస హసింప

గీ. జాఱుఁగొప్పున ముడిచినజాజివిరుల, తావి తనతోడి యచ్చరతెలిరుఁబోండ్ల
కైశ్యకల్పప్రసూనసౌగంధ్య మడఁప, రంభ చనుదెంచె దేవతారాజసభను. 39

గీ. వచ్చి భయభక్తు లెసఁగంగ వాసవాదు, లైనపెద్దల కొకపాటి యానవంబు
వంచి మడిసందులను హస్తవారిజంబు, లిడ యొకించుక వెనుకకు నేగి నిల్చె 40

క. తనజాడ లన్ని యచ్చటఁ, గని వచ్చినయట్టిచూనికంకీనవు న
య్యనిమిషసంయమిఁ గని య, య్యనిమిషలోచన హృదయ మట్టిట్టయ్యెన్. 41

ఉ. అప్పుడు వాసవుండు కడు నాగ్రహ మొప్పగ నత్తలోదరిం
దప్పక చూచి నిన్ను వసుధామరసూతికిఁ గౌఁగిలిచ్చి నే
నప్పుడ రమ్మటంటి హరునాజ్ఞ యలంఘ్యము గానఁ గోర్కె మై
నెప్పుడు వానితోడ మది నిష్టము సల్పుచు నుండు మంటి నే. 42

క. ఏమీ వరచామీకర, భూమీధరకటకకుంజపుంజక్రీడా
సామీచ్యము మానవ, ధామవిహారంబుఁ బోలదా దుష్టమతీ. 43

గీ. చంచలింప కిట్టి సాహసకృత్యంబు, చేసినావు గాన నోసి పోయి
భయదరూప మైన పాషాణ మై పుట్టు, పల్లవుఁడు వసించుపట్టణమున. 44

కో. అని శాప మొసంగిన యా, య్యనిమిషవిభుఁ జూచి రంభ యత్యంతభయం
బున సాగి మ్రొక్కి కరుణా, జనకంబుగఁ బలికె నముచిసంహారకుతోన్. 45

ఉ. ఈమహనీయశాపమున కెయ్యది యంతము చెల్ప వయ్యయో
యామరలోకనాథ సదయంబుగఁ జూడఁగదయ్య యోశచీ
వామదృగీశ వాకలుషవర్తన మెన్నకు మయ్య యోసుర
స్వామి యటంచు వే వగల సన్నుతి సేసె నార్ద్రచిత్తుఁడై. 46

క. రమణీ తప్పదు నావా, క్యము పాషాణత్వ మొందు మదియెన్నటికిం
దుముకై ధరణీస్థలిఁ బడు, నమరఁగ శాపమును నాఁటికంతము నొందున్. 47

వ. ప్రొమ్ము ధరిత్రినిం బుట్టు మని నియోగించి కొలువు చాలించి శచీకాంతుఁ డంతః
పురంబున కరిగె సురగరుడోరగాదు లందఱుఁ దమ నివాసంబులకుఁ జనిరి తదీయ

నీవీమాటకు సందే, హావిర్భావంబు నొంద కబల కఠోర
గ్రావంబై పుట్టుము నా, నావెలఁదియు నట్లు చేసె నాపురముకడన్. 58

క. శతతాళదఘ్న మగున, య్యతులగ్రావమ్ముఁ జూచి యప్పుడు భయసం
గతులై యాశ్చర్యసమా, యతులై గజగజ వడంకి రచ్చటిజనముల్. 59

క. అదిరా యౌన్నత్యభరం, బిదిరా విస్తారగరిమ వీక్షింపఁగ ని
ట్లదిరా కాఠిన్యగుణం, బదిరా యిది కొండ గాక యశ్మమె తలఁపన్. 60

సీ. అశ్మవాదులతోడ నాకృతి దాల్చిన, భాగ్యదేవతయొ యీ ప్రస్తరంబు
కాక లోకం బెల్లఁ గబళింప వచ్చిన, యాదిశక్తియొ యీమహాదృషత్తు
బలిసద్మరంధ్రంబు వెలువడి యెగసిన, యురగేంద్రుఁడో యీదృషోపలంబు
దుస్సహానిలగతిఁ దునిగి రాలినకాంచ, నాద్రిశృంగంబొ యీయశ్మరాజ

గీ. మీసమున్నతశిల నీరజాసనాండ, సదనసంస్థాపితోజ్జ్వలస్తంభ మొక్కొ
యీభయంకరపాషాణ మినజబాహు, దండకలితసముద్దండదండ మొక్కొ. 61

వ. అని యనేకప్రకారంబుల వితర్కించి యిది మహాదుర్నిమిత్తంబు గాని వేఱొండు
గాదని నిర్ణయించి నిజనివాసంబుల కరిగి రంత దైవవశంబున. 62

ఉ. మందరధీరుఁ డన్యనృపమర్దనుఁ డాపురమేలురాజు శ
త్రుందముఁ ద్రొక్కినాఁడు పరితోషభరంబున మంత్రులెల్లఁ జూ
డం దగ దన్న మానక హఠాత్తు హయోత్తమ మెక్కఁ డెక్కి వ
చ్చెం దురుసీలు కొన్ని తనచేరువ రా నుపలంబుఁ జేరఁగన్. 63

. చనుదెంచి నయనగోచర, మును వాగ్గోచరము గాక భువనాద్భుత మై
తనరుబలుఱాయిఁ గనుగొన, జననాథునిమది కొకింత జడుపుదయించెన్. 64

మ. అపు డచ్చో నొకరావిచెట్టున మనోజ్ఞాకారసంపత్తికి
న్విపరీతం బగుబ్రహ్మరాక్షసుఁడు నుద్వేగాతిరేకంబున
న్నృపచూడామణి నావహించె సచివుల్నిర్విణ్ణులై చూడఁ గాఁ
జపలాత్ముం గని పెట్టి యుండుఁ గద యస్వాపంబులై యాపదల్. 65

. ఒకలాగున మాటలు తొక, తొకలై వెడలంగఁ జొచ్చె దుడిదుడి నెందే
నొకఁడ చనఁ దొడఁగెఁ గన్నులు, పెకలించుక చూడ సాగె భీతి దలిర్పన్. 66

. స్వప్నంబునం దైనఁ జాపల్య మెఱుఁగని, సార్వభౌమునకుఁ జంచలత తోఁచె
నేకాంతమున నైన హెచ్చుమాటలు లేని, వసుధేశతిలకంబు వదరఁ జొచ్చెఁ
బరిహాసమున కైన దరహాస మొందని, నరనాథుఁ డూరక నవ్వఁ బూనెఁ
దలిరాకుఁబోఁడులొద్దను వికారము లేని, ధీరుం డహేతువికారుఁ డయ్యె
సూనృతమె కాని నాలుకఁ జొనుపనట్టి, నాయకాగ్రణి దబ్బఱ ల్గూయ సాగెఁ
బసిఁడిసమ్మాళిగలు లేక పాద మిడఁగ, భరముపడురాజు బరిగాళ్ళఁ బఱవ సాగె. 67

క. అప్పుడు మంత్రులు కార్యము దప్పెఁగదా యనుచు మెల్ల ధరణీనాథున్
గప్పుక చని యంతఃపుర, మెప్పుడు చేరెదమొ యనుచు నెదఁ దలంకన్. 68

సీ. కాలసర్పముఁ బట్టఁగడఁగుమాంత్రికులు నా, నోడిసిన నొక్కింత యొడియఁ బాటి
పవనవేగముఁ గట్టఁ జనెడుమాంత్రికులు నాఁ, దిరిగిన వెంటనే తిరుపుగట్టి
తీవ్రప్రవాహ మీఁదెడు నేఁతకాండ్రు నా, వెలిబోక కాక వెంబడిన పోయి
చిచ్చార్పఁగాఁ బోవు చేర్వమట్టములు నాఁ, జుఱుకు దాఁకినఁ బోక మఱియుఁ గదిసి

గీ. యొకవిధంబున మంత్రులు యుక్తిచేత, బ్రహ్మరాక్షసనిర్వేశభరసుదుర్ని
వారబహువిధచేష్టావికారసహాయు, రాజవరుఁ దెచ్చి యంతఃపురంబుఁ జేర. 69

గీ. తోడుకొని వచ్చి యన్యులు చూడకుండ, నొక్కయేకాంతగృహమున నుండఁ జేసి
పదిలముగఁ గావలులు పెట్టి వెదకివెదకి, మాంత్రికులఁ దోడితే సహమ్మతిని వారు. 70

సీ. ఎంతమాత్రం బిది యీక్షణంబున లేదు, బంతి గావించెదఁ బ్రజ్ఞ మీఱఁ
బూనిక నప్పటి పూరి మంత్రించెనేఁ, బొమ్మన్నఁ బోదె యీభూమి వెడలి
మాతుము గా పోవ్ర జేతాళుఁ డైనను, నాపేరు విన్న నిన్నాళ్ళదాఁక
దాని కేమాయె నెందాఁక నాలస్యము, తెప్పింపుఁడు విభూతి తేటగలది

గీ. యనుచు నొకవాఁడు నొక్కొక్కఁ డధికముగను, నించుకటుమించుగాఁ బంతగించుకొనుచు
వశదిశాబంధనము చేసి ధరణినాథ, శేఖరునిఁ జేరె మాంత్రికశ్రేష్ఠు లధిప. 71

సీ. నరసింహము జపింప నరసింహము జపించు, నాదిభైరవమున కదియె నుడువు
శతరుద్రియముఁ బూన శతరుద్రియముఁ బూను, హనుమజ్జపంబున కదియె చేయు
నీలకంఠముఁ బల్క నీలకంఠముఁ బల్కు, నంబాస్తవంబున కదియె నెఱపు
శ్రీరామముఁ జపింప శ్రీరామముఁ జపించు, నష్టాక్షరిని నెన్న నదియె యెన్ను

గీ. వీరభద్ర మెన్న వీరభద్రమె తెచ్చు, శరభ మన్న నదియె సంగ్రహించు
మనుజనాథ కడమమంత్రంబు లాబ్రహ్మ, రాక్షసునకు నీళ్ళు ద్రాగినట్లు. 72

క. మొదలఁ గడుఁ బౌరుషస్థితి, తుది నేమియు లేక జనులు దూషణ సేయన్
గమపులు కదుపులు గట్టుచు, మది లజ్జాపరతఁ జనిరి మాంత్రికు లధిపా 73

సీ. ఐతిహాసికమాళి యనిపించు నొకవేళ, నొకవేళ శుష్కతార్కికత నెఱపుఁ
బాణినీయపుఫక్కి వాదించు నొకవేళ, నొకవేళ వేదాంత ముపచరించు
శ్రోత్రియాగ్రియవృత్తిఁ జూపించు నొకవేళఁ, నొకవేళఁ గడుజ్యోతిషికతఁ దనరు
సంగీతమాధురి చవిచేల్చు నొకవేళ, నొకవేళ సుకవితాయుక్తి వరలుఁ

గీ. జదువు నొకవేళఁ గావ్యము ల్నవసఫణితి, నుడువు నొకవేళ మంత్రము ల్పూర్ణ వేల
సామవేదము నొకవేళఁ జదువుచుండుఁ, బ్రతిభమీఱఁగ నాబ్రహ్మరాక్షసుండు. 74

వ. ఇట్లు సకలమంత్రతంత్రంబులకు నసాధ్యంబై యాబ్రహ్మరాక్షసావేశంబు సంస్తంభింపక విజృంభించులాగు చూచి ప్రధాను లెల్ల నాత్మగతంబున. 75

ఉ. మొత్తఁగఁ జొచ్చె గౌరవసమున్నతి వాయఁగ భూతవైద్యులం
దొత్తుల మొత్తినట్లు కడుదుర్భరభావము నొంది భూమిపా
లోత్తముదేహముం బడలె నున్నను గార్యము లే దిఁక న్నివే
కోత్తరబుద్ధిఁ జెప్పఁ దొకబుద్ధివిశేషము పెద్ద లందఱున్. 76

వ. అని వితర్కించుకొను చున్నసమయంబున. 77

గీ. బ్రహ్మరాక్షసువార్త నిరంకుశుండు, విని మరుత్కాంతశాపంబు వెడలఁ ద్రోయ
నిదియె తఱి యంచు వచ్చె భూమీశమంత్రు, లున్నపనిలేక చింతించుచున్నకడకు. 78

క. వచ్చి నమస్కారం బని, యచ్చోఁ గలపెద్ద లెల్ల నాదరమునఁ జో
టిచ్చి వసింపఁగఁ జేయఁగ, నచ్చతురాననకులీనుఁ డనియె నృపాలా. 79

ఉ. దుందుడుకాఱ శాత్రవులదోర్బలసంపదఁ జక్కఁజేసి ధా
త్రిం ఘనబాహుపీఠమునఁ దిన్నదనంబుగ నిల్పి భోగసం
క్రందనుఁ డై ప్రజ ల్పొగడ రాచఱికం బొనరించునట్టిశ
త్రుందము నంతవానికిని దుష్టపుదైవము కీడు దెచ్చె నే. 80

గీ. సత్యసంధులఁ జేర్చుచు నసత్యపరులఁ, ద్రోచు ననఘుల రక్షించు దుష్టకర్మ
గల్గువారల శిక్షించు ఘనులఁ బెంచు, హీనులను ద్రుంచు దయ నిట్టినృపతి కలఁడె. 81

వ. అని యనేకవిధంబుల మనుజనాథు వర్ణనము చేసి పిదప 'దైవంబుఁ దిట్టి తలంచిన
నా కొకదైవలీల గల దంచుం బల్కి మెల్లన శరీరంబు గగురుపొడవ. 82

మ. ఒకనిట్టూరుపు పుచ్చి కన్నుఁగవ నీ రుప్పొంగఁగా నావలిం
చి కరాబ్జంబులు మీఁది కెత్తి తనుయష్టిం గంప మేపాఱ నిం
చుక యాలాపము చేసి వెక్కసముగా శోకించి శోకించి వేఁ
డుకొనంగా నొకకొంతసేపునకు నాటోపంబు సంధిల్లఁగన్. 83

గీ. ఇపుడు పుట్టినపాషాణ మెల్లఁ గొట్టి, తుమురుగాఁ జేసి ధరణిపైఁ దూరుపెత్త
రాజుఁ బట్టినయా బ్రహ్మరాక్షసుండు, విడుచుఁ గాని మ ఱేమిట విడువఁ డనిన. 84

క. ఇదియా నిది గా దనియెడి, సదనులబోధంబు లేక సచివావళియా
నిది మంచికార్య మనుచు, న్మది నెన్న విపత్తి మతికి మతికిం బొందెన్. 85

గీ. రాయి దిగులంగఁ గొట్టిన రాజునొడలి, బ్రహ్మరాక్షసుఁ డేగునే పార్థివేంద్ర
ధరణిపైఁ 'బృష్టతాడనా ద్దంతపతన', మనిన పరిహాసవాక్యము సార్థమయ్యె. 86

వ. ఇట్లు నిశ్చయించి వారు సకల భూప్రజల రప్పించిన. 87

క. శతతాళదఘ్నమగున, య్యతులగ్రావంబుఁ జూచి యాఖిలగ్రామా
గతులై నమ్మనవులు తమ, శ్రుతసాధనవిధులచేతఁ జూర్ణము సేయన్. 88

సీ. గబ్బిగుబ్బలమీఁది కస్తూరికాపంక, మాణిముత్తెపుఁ జేర్ల నంటుకొనఁగ
జాళువాబంగారు జలపోతనుచ్చుపై, నొడిదారములకాంతి జడికొనంగ

గులుకుఁ జెక్కులలోన గురివెందతాటంక, రోచులు దాఁగిలిమ్రుచ్చులాడ
నడురాజు చెంగట నున్నరోహిణిమాడ్కి, మోముపై ముంగరముత్య మలరఁ
గీ. కాలఘనకల్పకైశికాకల్పకల్ప, పుష్పగంధంబు దిక్కుల బుగులుకొనఁగ
వెలఁదిపాషాణమార్గంబు వెడలి నాఁడు, కదలిలోపలఁ బుట్టినక్రమము దెలిపె. 89
వ. ఈరీతి వన్నాతి రాతిపొడి వెడలి నిలిచిన సకలజనంబులు తమమనంబుల. 90
సీ. కోటకోటఁ గురియునో జంటితేనియమోవి, నొదవునో జాబిల్లి కొదవ నుదుట
విసరునో శృంగారరసవృష్టి కొప్పునఁ, దొలఁకునో యమృతంబు పలుకులందు
రాలునో కుముదపత్రములు చూపులయందు, వెడలునో సింగిణివిండ్లు బొమల
వెళ్ళఁబెట్టునొ పూర్ణవిధుకాంతి మొగమున, దిగపారునో పైఁడితెలివి మేన
గీ. వెడలఁ బొంగునొ చెక్కుల విమలరత్న, దర్పణద్యోతనిగనిగల్ తఱచు గాఁగ
జోడుకూడి చెలంగునో చూడఁ జూడ, గబ్బిగుబ్బలఁ గోడెజక్కవలకవలు. 91
ఉ. గుత్తపు గుబ్బలాఁడి సుమకోమలి ముద్దులగుమ్మ మల్లిపూ
గుత్తి మెఱుంగుఁదీఁగె లతకూన మనోజురవాళి జాళువా
ముత్తెపుఁగోల చంద్రకళ మోహనమంత్రము కాంతిరాశి యీ
పుత్తడిబొమ్మ యేకరణిఁ బుట్టెనొకో యుపలంపుధూళిలోన్. 92
సీ. జలుఁగుఁబయ్యెద జాఱఁ జికిలిగుబ్బలకాంతి, దిగపార దిశ లెల్లఁ దెలివిపఱప
నలవోక గాఁ జూడ నసమాస్త్రనిశితమా, ర్గణపరంపర లొక్కరాశిఁ బడఁగఁ
గరపంకజము లూఁపఁ గనకకంకణఝుణ, నాదసంపద గుమానముగఁ జెలఁగ
బ్రతిపదంబున నూపురఝుళంఝుళవిరావ, మున మూఁగఁబడి హంసములు దొలంగఁ
గీ. వనరు చాతుర్యధుర్యసౌందర్యరేఖఁ, బగిలి పీడనిచూపుల మగిడి డిగియ
రాక మర్త్యుల వెంటాడి రా నమర్త్య, నీరజాక్షి నిరంకుశుఁ జేర వచ్చె. 93
క. చనుదెంచి వచ్చి నిలిచిన, వనజేక్షణఁ గౌఁగిలించి వసుధాసురనం
దనుఁడు నయనాంచలాశ్రులు, కొనగోరఁ దొలంగ మీటుకొనుచుం బలికెన్. 94
క. నాకై లోకైకస్తు, త్యాకారము రాతిలోన నణఁగించి మనో
వ్యాకీర్ణశోకభరమున, నాకులపడి యుండవలసె నా తరళాక్షీ. 95
వ. అన విని యయ్యరవిందదళాయతాక్షి భూసురనందనున కిట్లనియె. 96
సీ. నలునకా శనిచేతియలఁత హరిశ్చంద్ర, మహిపాలమౌళికా మాలకొల్వు
రోహిణీభర్తకా రాహుచేఁ బడుపాటు, పంచసాయకునకా భస్మ మగుట
వనజసంభవునంతవానికా తలఁపోక, పాకశాసనునకా బ్రహ్మహత్య
యరవిందనేత్రునకా బోయచేఁ జావు, హరునకా భిక్షాటనావసక్తి
గీ. ఘనుఁడు రామనృపాలునకా తలంప, నుత్కటం బైనపత్నీవియోగదుఃఖ
మెంతవారికిఁ గాని మహీసురేంద్ర, కర్మ మనుభవనీయంబు గాక పోదు. 97

క. ఆపద లెవ్వరికైనన్, బ్రాపింపక పోవు వానిఁ బాపఁగ మిగులన్
ప్రాపగుచుట్టము గలుగుట, పో పుణ్యవిపాకఫలము భూసురవర్యా. 98

ఉ. ఆపదకైనబంధుజన మక్కఱదీర్చుధనంబు రోగమున్
బాపఁగఁ జాలునౌషధము పాపవిముక్తినిఁ జేయుపుత్త్రుఁడున్
గోపనుడంబుతెల్వి బుధకోటికి మెచ్చగువిద్య దీనసం
తాపముఁ జూడలేనిదయ దైవవశంబునఁ గాక కల్గునే. 99

గీ. నాకు నినువంటి వినయనిర్ణయధురీణు, పొందు గలుగంగఁ గాదె యోభూసురేంద్ర
పాకశాసనదత్తశాపము దొలంగె, నరతరం బైననిర్జరత్వంబు గంటి. 100

క. అని పలికి ధారుణీసురు, తనయాగ్రణి పూర్వమైనదయ తప్పకుమీ
నిను మఱవ నేనె వత్తున్, గనియుం గనకుండఁ గా నొకానొకవేళన్. 101

చ. వినయగుణోత్తరుండవు వివేకసమగ్రుఁడ వార్యకోటిలో
ఘనుఁడవు నీతిశాలి వది గాక మనోహరమూర్తి వెంతయున్
వనితకు నిన్నువంటిమగవానికవుంగిలి గల్గుటల్ మనం
బునఁ దలపోయఁ బూర్వకృతపుణ్యవిపాకము గాక కొంచెమే. 102

క. తనువుం దనువుం గూడుట, ఘనతరసంసర్గఫలము గాదు తలంపన్
మనముక్ మనముం గూడుట, యనుపమసంసర్గమహిమ యవనిసురేంద్రా. 103

క. అది గాక మనకు మదియుక్, మదియుగ్ గలసినది యింక మఱపులు గలవే
ముద మొదవఁ బోయి వచ్చెదఁ, ద్రిదివంబున కనుచు రంభ దివికిం జనియెన్. 104

సీ. చామరగ్రాహిణీస్వర్ణకంకణఘృణ, తార్కరపోషితనటీకటకనినదుఁ
దనులతాముకుళమేధావిధాయకసౌర, గాయకగేయసంకలితపులకు
ధవళసారసలసత్కాసారమతికార, ణాంబకాంబుజసహస్రాంచితాంగు
వర్ణితదోర్లతాస్వస్తికామరయోషి, దభిరామకాంతిభాగుభయభాగు

గీ. నిర్జరాచార్యజల్పితనీతిశాస్త్రి, పచనకంపితమూర్ధపార్శ్వప్రదీప్త
రత్నమయకుండలప్రభారాజమాను, నింద్రుఁ జేరంగ వచ్చెఁ బూర్ణేందువదన. 105

క. చనుదెంచి మ్రొక్కి నిలిచిన, వనితామణిఁ జూచె దివిజవల్లభుఁడు రవు
ల్కొనుకోపవహ్నికీలల, కును బొమముడి ధూమపంక్తి కొదువం దీర్పన్. 106

వ. ఇవ్విధంబునఁ గోపోద్రిక్తంబుగాఁ జూచి యిట్లనియె. 107

గీ. లంజ విటుఁ డొనర్చులాలనభరమున, మఱచె నేమొ కాక మమ్ము లక్ష్య
పెట్టదో ప్రభావపేశలత్వమున తే, కున్న శాపభీతి నొందకున్నె. 108

వ. అని రంభ నుద్దేశించి. 109

గీ. తొలుతఁ జేసినట్టిదుష్టకర్మంబున, సంగ్రహింపరానిశాప మొందె
స్వద్రసంపునడకఁ జరియింపు మిపుడైన, మగువ యోజ మాన మందుగలదె. 110

క. భూపాలయంబునఁ బలురా, యై వెలయు మటన్న విభవమాసపడి దివిన్
నీ వెంతచుట్లఁ బెట్టినఁ, బోవునె శాపంబు భోగముఁగా కబలా. 111

క. అని కోపగించి పలికిన, యనిమిషవిభునకును మ్రొక్కి యది వినిపించెన్
వను శపియించుట మొదలుగ, ఘనతరశాపోపశాంతి గడవల గాఁగన్. 112

క. ఓహో యింతయుపాయున, మోహితుఁడా విప్రసూతి యటుఁ గాకున్నన్
సాహసికుఁ డై జయించునె, యాహా నెయ్యంబుతోడ హరు జూదమునన్. 113

మ. సొగటా లాడి హరుం జయించినజనుస్తోత్రవ్యచారిత్రుఁ డా
జగతీదేవకుమారుఁ డాతనికి నీశాపంబు వారించు టెం
త గణింపం గనుఁగో ముదం బొదవ నద్ధాత్రీసురుం జూత మం
చు గజశ్రేష్ఠము నెక్కి వచ్చె హరి యస్తోకోన్నతిన్ ధాత్రికిన్. 114

క. సురరాజు వచ్చెఁ జనుదెం, చిరి తమతమవాహనములు చెలఁగఁగ విద్యా
ధరగుహ్యకాప్సరసకి, న్నరరక్షోయక్షసిద్ధనాకనివాసుల్. 115

వ. అట్లు దనకుం బ్రసన్నుఁ డైనదేవేంద్రునకు దండప్రణామంబులు చేసి యాభూసుర
నందనుం డిట్లనియె. 116

సీ. బలవృత్రనముచిజంభపులోమముఖదైత్య,వన వహ్ని హేతి యెవ్వాని హేతి
చిత్రసంగరజయశ్రీకరగ్రహణ ని,ర్వహణవిహస్త మెవ్వాని హస్త
మనఘకర్మాయాతఘనతరైశ్వర్యని,ర్వ్యూఢపుణ్యలోక మెవ్వాని లోక
మసమానకారుణ్యరసవర్షిలోచన,వనజనికాయ మెవ్వాని లోక

గీ. మమరవనమధ్యకేళిసౌధాంతరాళ, వర్ణ్యతరసంప్రచరణ మెవ్వాని చరణ
మట్టిలోకైకవందితు నప్రమేయు, నిన్ను వర్ణింపఁగా నేర్తునే సురేంద్ర. 117

శా. వంశారణ్యముఁ గాల్చు పావకగతిన్ వర్ధిష్ణు వై విద్విష
ద్వంశారణ్యము నిర్దహించు భవదుద్దామప్రతాపాగ్ని శీ
తాంశుస్ఫూర్తులు సంశ్రితావళికి నీయాకారరేఖల్ త్రయ
స్త్రింశత్కోటిసుపర్వనాథుఁడవు కీర్తింప న్నినున్ శక్యమే. 118

గీ. తగఁ బరాగము గప్పినతమ్మికొలను, మాడ్కి హరిచందనాలిప్త మగుచు వేయుఁ
గనులతో నొప్పు నీయుదగ్రప్రదీప్త, తనువుఁ గీర్తింప నేర్తునే యనిమిషేంద్ర. 119

వ. అని యనేకప్రకారంబులం గీర్తింప నన్నిలింపసార్వభౌముండు. 120

ఉ. మెచ్చితి నీప్రవీణతకు మేలు ధరాసురవర్య వేఁడుకొ
మ్మిచ్చెద నీకభీష్ట మన నెంతయు సమ్మద మంది వాంఛితం
బిచ్చెద వేని నా కనిమిషేశ్వర యీధరణీతలేశ్వరున్
సచ్చరితాగ్రగణ్యు గ్రహసంభృతు నిగ్రహుఁ జేసి కావవే. 121

చ. అన నిది యెంతమాత్రము, ధరాసురనందన వేఁడు మింక నొం
డనుపమ మైనకోర్కి యన నాబలసూదనుతోడ బ్రాహ్మణుం

డనిమిషలోకనాథ విబుధాబ్జముఖీమణి రంభపట్టునన్
జన దభిలాష మేమియును సారసగంధిని నా కొసంగవే. 121

ఉ. నా విని నవ్వి యవ్విబుధనాయకుఁ డిట్లను విప్రసూతితో
నోవిటసార్వభౌమ వికచోత్పలలోచన రంభ నిత్తుఁ గా
కావసుధాస్థలిన్ దివిజకాంతల నుండఁగరాదు వచ్చుచుం
బోవుచు నుండు భూతలికి భోగముఁ జేకొను పూర్వరీతిగన్. 123

వ. అని యనేకదండప్రణామంబులు సేసి నిలిచిన. 124

శా. రింఖాపాతమునం జదల్ గదుల నిర్విచ్ఛేదవారానిల
ప్రేంఖద్వ్రాతపరంపరల్ దసల నాఖీలంబుగాఁ బర్వ వై
శృంఖల్యంబునఁ బట్టపల్లవుసిరుల్ చేర్వార నుచ్చైశ్శ్రవః
కంఖాణంబు గదల్చె నాసవుఁడు దిక్పాలాదిసంసేవ్యుఁడై. 125

సీ. అప్పుడా రాజు భూతావేశనిర్ముక్త, దేహుఁడై కాంతిసందీప్తుఁ డయ్యెఁ
దదనంతరమున రత్నంబుల నభిషిక్తుఁ, జేసిరి మంత్రులు భూసురేంద్ర
నాపిమ్మట నృపాలకాంతఃపురస్త్రీలు, తమతమసొమ్ము లెంతయు నొసంగి
రటుతరువాత దేవాంగనామణి యగు, రంభ యేతెంచి సంరంభ మొదవ

గీ. గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి యోగుణసముద్ర, నీకతన శాపమోక్షంబు నాకు దొరకె
నీవలన నచ్చరలలోన నేవ గంటి, నిన్నుఁ గూరిచి హరియు మన్నించె నన్ను. 126

క. వినవోయి నిరంకుశ నీ, కును నాకును లోకభర్త కూర్చినయిష్టం
బునఁ బాయ మని యెఱుంగుము, చనియెద నిప్పటికి మగిడి చనుదెంతుఁ జుమీ. 127

క. అని యనిమిషభామిని పో, యినపిమ్మటఁ దల్లిదండ్రు లెంతో సంతో
షనితాంతహృదయు లై పు, త్రునిఁ గౌఁగిటఁ జేర్చి పులకధూర్వహతను లై. 128

క. తనయా నిన్నింత నయా, ధన్యుని ప్రాప్త మెఱుంగ లేక యొకమానవమా
త్రునిఁ గాఁగఁ జూచి నిరసిం, చినయపరాధంబు నారసి క్షమింపఁగదే. 129

సీ. ఒకనికి శక్యమే యురగభూషణుతోడ, నలఘుచాతురి జూద మాడి గెలువ
గెలిచెఁ బో యొకనికిఁ దెలియునే సామాన్య,రమణుల నడుగక రంభ నడుగ
నడిగెఁ బో యొకనికి నలవియే సురకాంత, లాలించి భూమి నిల్లాలిఁ జేయఁ
జేసెఁ బో యొకనికిఁ జెల్లునే చిరభోగ్య, మగునింద్రశాపంబు నపుడె మాన్ప

గీ. నీకుఁ దక్కఁగ వికచనాళీకలోచ, నామనోహరదేహసౌందర్యధుర్య
తానివారితకీర్తిలధామ సోమ, ధరకృపాపాత్రపుత్రకందర్పదర్ప. 130

క. అని వినుతి సేయుజననీ, జనకుల బహుళార్థములను సంతుష్టులుగా
నొనరించి రంభయనుమతిఁ, దనయంగనయందు సుతయుతతనయులఁ గాంచెన్. 131

వ. మఱియు నతండు వ్యవహారపదవ్యాఖ్యానాసక్తమానసతత్త్వపరాయణపరిప్రాప్తవిజ్ఞాన
పాటవంబున నేకవాక్యప్రతిష్ఠాపనాచార్యుండును ద్విజవంశపావనుండును త్రివర్గనిర
తుండును జతుర్వేదపారాయణుండును బంచశరాకారుండును షట్శాస్త్రపారీణుం
డును సప్తాశ్వతేజుండును నష్టభోగసంపన్నుండును నవనిధానసంపన్నుండును దశదిశా
పూరకీర్తిమండలుండు నై చెలంగె. 132

క. ఎటువంటిదురాచారున, కెటువంటిజగత్ప్రసిద్ధి యెఱిఁగితె రాజా
యటు గానఁ బూర్వపుణ్యో, త్కటభావం బల్పు నైన ఘనుఁ గావించున్. 133

చ. అని ముని ధర్మశీలవసుధాధిపమౌళికి నేర్పరించిచె
ప్పినకథ బాల్యచాపలముపెంపున స్వామికి విన్నవించితిన్
జనకుఁడు బాలుఁ డాడునపశబ్దవచోనివహంబుచేత నె
మ్మనమున మోదమందు క్రియ మామకవాక్కుల సంతసిల్లుమీ. 134

మ. మదనధ్వంసక తారభూమిధరధామా ధామధామాక్షసం
మదసంధాయక దివ్యనామ నిజవామావామవామాంగ దు
ర్మదసంతావళదానవప్రవరభీమా భీమభీమత్వసం
పదగారీకృతదుష్టదైత్య ధృతసోమా సోమసోమేశ్వరా. 135

శా. భస్మోద్ధూళితదేహపోషణకళాపారీణ వారాకరా
కస్మాదుద్ధితకాలకూటవిషదిగ్ధగ్రీవ పాదాంబుజా
తస్మర్తృవ్రజకల్పభూజ కరుణార్ద్రన్యేక్షణా సేవమా
నాస్మత్త్రాత్రకముత్తనూభవకనాగాఖ్యాంకలింగాహ్వయా. 136

క. అతులతరసోమవార, వ్రతనియమధురీణహృదయవారిజ సాధ్వీ
శతవినుత చెన్నమాంబా, ప్రతిదినసంసేవ్యమానపదపంకేజా. 137

గద్యము. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధవర్ణవర్ణనీయకవిత్వతత్త్వధౌరేయ వెపలింగి
నార్యగర్భార్ణవపూర్ణిమాత్రేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానమానస
సకలవిద్వజ్జనవిధేయ రుద్రయనామధేయప్రణీతం బైననిరంకుశోపాఖ్యానం బనుమహా
ప్రబంధంబునందు సర్వంబుఁ జతుర్థాశ్వాసము.

సంపూర్ణము.

☞ ఈకావ్యపుఁ బీఠికలో 10 వ పఙ్క్తిలో 'గ్రీ॥ శ॥' అనుదానికిఁ బిదప '1620 సంవత్సరములు' అని చదువునది.

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు ముద్రితము.—1916.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రసికజనమనోభిరామము, శుద్ధప్రతి | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము ,, | ... | 0 | 8 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి. తిమ్మకవిది | ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 6 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ. వెంకమ్మప్రణీతము, చక్కనికూర్పు | | 0 | 14 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | [illegible] | 12 |
| ఉత్తరహరివంశము, సోమనాథకృతము | ... | 1 | 4 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 8 |
| సులక్షణసారము, సటీక ,, | ... | 0 | 8 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 4 | 0 |
| దసరాపద్యములు ,, | ... | 0 | 1 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | ... | 0 | 12 |
| అప్పకవీయము, చక్కనికూర్పు, అట్టబైండు | ... | 1 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 4 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 0 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో ,, గట్టుప్రభువుకృతము | ... | 0 | 6 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| రూపవతి, రాజపుత్రస్త్రీసాహసపుకథ, శ్రీ ఎనమంద్ర. నారాయణమూర్తిగారిది | | 0 | 3 |
| శ్రీనాథునివీథినాటకము | ... | 0 | 2 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |
| కన్యాశుల్కము, శ్రీగుర్జాడ అప్పారాయకృతము | ... | 0 | 12 |
| కృష్ణాకుమారీనాటకము, శ్రీసీతారామకవిగారిది | ... | 0 | 10 |
| ఆంధ్రవచనభాగవతము, ౩ సంపుటములు | ... | 7 | 0 |
| సంగ్రహరామాయణము, సులభశైలి, శ్రీ శేషాద్రిశర్మకృతము | ... | 0 | 5 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము, సులభశైలి | ... | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| దశకుమారచరిత్రము. శ్రీ ఏనమచింతల. సంజీవరాయశాస్త్రికృతము ... | 1 | 4 |
| శివాజీచరిత్ర ... | 0 | 6 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర ... | 0 | 2 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమలతో ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్ర ,, ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర, ప్రతిమతో ... | 0 | 2 |
| దాదాభాయి నౌరోజీచరిత్ర ,, ... | 0 | 1 |
| ఆనిబిసెంటుచరిత్ర ,, ... | 0 | 1 |
| వివేకానందస్వామి జీవితము, ప్రతిమతో ... | 0 | 1 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము ... | 0 | 1 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసములు ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర ... | 0 | 2 |
| శ్రీబుద్ధచరిత్రము ... | 0 | 4 |
| సోదరినివేదితజీవితము ... | 0 | 2 |
| చక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రి కృతము, క్రొత్తకూర్పు ... | 1 | 4 |
| మర్యాదరామన్నకథలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| పరమానందశిష్యులకథలు ... | 0 | 4 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము ... | 0 | 4 |
| సేచుకక్క పగటిమక్క కథలు ,, ... | 0 | 2 |
| మైరావణచరిత్ర ... | 0 | 2 |
| ఈసపునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము ... | 0 | 6 |
| షేక్స్పియర్ నాటకకథలు, సులభశైలి ... | 1 | 4 |
| అరేబియన్ నైట్స్కథలు, చక్కనికూర్పు ... | 1 | 4 |
| లార్డుక్లైవు జీవితము ... | 0 | 6 |
| శ్రీగురుజాడ, శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు ... | 2 | 8 |
| తారాభాయి, చక్కనినవల ... | 0 | 12 |
| ఆనందమఠ, నవల, నూతనముద్రితము ... | 0 | 12 |
| ఐవన్హో, నవల ... | 0 | 6 |
| మదాలస ,, ... | 0 | 10 |
| టిప్పుసుల్తాన్, నూతనకవితాశైలిని శ్రీ ఉమాకాంతముగారిచే విరచితము | 1 | 4 |
| సీతారామము, శ్రీతల్లాప్రగడ. సూర్యనారాయణరావుగారిది ... | 1 | 0 |
| ఉన్మాదిని నవల ... | 6 | 4 |
| రాధారాణి ,, ... | 0 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
192, ఎస్ప్లనేడ్, చెన్నపురి.